





# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# భక్త నామదేవ్





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్.

# భక్తనామదేవ

గ్రంథకర్త

మహావాది వేంకటరత్నము.



ప్రకాశకులు

పన్నాల సత్యనారాయణ,

తెనాలి.

౧౯౨౭

[ప్రథమ] [రు. ౧-౨-౦ లు.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.



## పురుషులు.

| | |
|---|---|
| రాముఁడు<br>గోపాలుఁడు<br>కేశవుఁడు<br>కృష్ణుఁడు | బాలురు. |

నామదేవు — కథానాయకుఁడు

దామాజీ — నామదేవు తండ్రి.

పాండురంగఁడు.

కిరాతుఁడు — వేషధారియగు పాండురంగఁడు.
లేక (శ్రీకృష్ణుఁడు.)

ఖిశోబా కేశుఁడు — నామదేవు గురువు.

సేనాజీ — రాధాబాయి తండ్రి.

వృద్ధబ్రాహ్మణుఁడు.

పాదుషా — ప్రభువు.

నాయుజీ — మంత్రి.

| | |
|---|---|
| రామాధాని<br>వేంకటశర్మ<br>కృష్ణశాస్త్రి<br>గోపాలమూర్తి | విప్రులు, అర్చకులు. |

## స్త్రీలు.

గుణాబాయి — నామదేవు తల్లి.

రాధాబాయి — కథానాయకి నామదేవు భార్య.

తారాబాయి — రాధాబాయి చెలికత్తె.

మొంకి — కిరాతుని భార్య.

ఇంకను సందర్భానుసారముగాఁ గొన్ని పాత్రలు వచ్చును.

ఓమ్.

# నాంది.

శ్రీరంగంబు పవిత్రజీవనకరశ్రీచంద్రభాగానదీ
తీరం బాగమఘోషసంకులమహాదివ్యస్థలం బందు నా
నీరేజాక్షుఁడు నిర్వికారుఁడు జనానీకంబుఁ బాలించు నా
శ్రీరంగేశుఁడు పాండురంగఁ డిడుతన్ సేమాయురారోగ్యముల్.

దురితాంభోధి తరంగడోలికలపైఁ దూఁగాడుచున్ నిల్చి యా
కరి ప్రాణాభయదానహస్త! త్రిజగత్కల్యాణ! పద్మాక్ష! మ
మ్మరయన్ రాఁగదె? దేవదేవ! యనఁ గుయ్యాలించి రక్షించు నా
కరుణాస్వాంతుఁడు పాండురంగఁడు మిమున్ గాపాడుఁగాకెయ్యెడన్.

(నాంద్యంతమున సభపైఁ గుసుమములు చల్లఁబడును)

---

 పాఠకులు గమనింపవలసిన విషయము.

'సేసెదను దీశా.' (పుట ౧౩) అనుదానికి 'సేతుజగదీశా!' అనియు
'ధీరమానసవాగేహా!' (పుట ౩౭) అనుదానికి 'ధీరమానసగేహా!' అనియు
'విరూపాక్షుని' (పుట ౪౧) అనుదానికి 'యనిమిషాక్షుని' అనియు
'నీమనోహారుండిదే' (పుట ౪౩) అనుదానికి 'నీమనోహరుండిదే' అనియు
'మఱప్రవచ్చెనె?' (పుట ౫౫) అనుదానికి 'మఱుప్రవచ్చెనె?' అనియు
'[illegible]' (పుట ౭౬) అనుదానికి 'భిన్నాభిప్రాయమును' అనియు
'[illegible]' (పుట [illegible]) అనుదానికి 'భగవదిచ్ఛ' అనియు

సవరించుకొనవలయును.

ఇంకను అచ్చటచ్చట తప్పులున్నను అచ్చుపొరపాటని యెంచవలయును.
ఇవియున్నచో రెండవ కూర్పున సవరింపఁబడును. మన్నింపుఁడు.

ఓమ్.

# భక్తనామదేవు

## ప్రథమాంకము.

### ౧వ రంగము. పండరీపురము - రాజవీధి.

(కేశవ గోపాల రామ కృష్ణులు నల్వురును పదియేండ్లకు మించని బాలురవలె నుండవలయును. వేషధారణము సామాన్యముగాఁ బీదవారియింటి బాలురకుఁబోలె నుండవలయును. నామదేవు పదునాలుగేండ్లకు మించని బాలుఁడుగను ప్రకృతియందు లోకవ్యవహారములయందు నిమగ్నుఁడుగను కాన్పింపవలయును. వేషధారణము నడుముకు ధోవతియు ముందువెనుకల వ్రేలుకట్టును జుంజురువెంట్రుకల గలిగియుండు మోమున వైష్ణవనామములును కంఠమునఁ దులసిమాలలును కరముల ధగనపు బల్లెలును వక్షస్థలంబున గద్దె విడియుండు ... సాంబునను బాహువులయందును విష్ణుచిహ్నంబులను గలిగి యుండవలయును. రంగమున వచ్చు ధ్యానపరుఁడై ... స్థయుత్వమున నుండవలయును. భక్తస్వరూప భావాదులు ప్రకటించునట్లుండవలయును.)

(తెరనెత్తగాఁ గొందఱు బాలురు గోలికాయల నాడుకొనుచుఁ దగవులాడు కొనుచుందురు.)

రాము—గోపాలా! నిష్కారణముగఁ దగవులాడిన లాభ మేమున్నది?

గోపా—అవును. నీకాయకన్న నాకాయయే దూరముగానున్నది.

కేశ—అదికాదు. మీయిద్దఱి కాయలు సరిదూరమున నున్నవి.

గోపా—అట్లెప్పటికిఁగాదు. కృష్ణా! ఎవరిది దూరముననున్నదో నీవు చెప్పుము?

కృష్ణు—ఇందు చెప్పనదేమున్నది? కేశవుడు చెప్పినది సరి. అది కాకుంటే యింక ఒక మాటకు రాముని కాయే దూరముగా నున్నది.

గోపా—అదిగో! మీరందరుగలసి నాకు దోకిళ్లుపెట్టజూచుచున్నారు కాదు? ఇంక నేనసలే ఆడనుపోండి.

[అని పోఁబోవును.]

రాము—(అడ్డగించి) అబ్బో! ఆడకుండనే పోతావుగా? (దిక్కులు పరికించి) అదిగో! ఎవరో యొక బాలుఁ డిటు వచ్చు చున్నాఁడు. వాని నడిగి మన తగవుఁదీర్చుకొందము.

గోపా—(చూచి) ఓరీ వీఁడటరా? దామాజీ కొడుకు నామదేవురా? వీఁడు వట్టిపిచ్చివాఁడు. ఒకరితో మాట్లాడడు. తనలోఁ దానే యెల్లప్పుడేదియో గొణుగు కొనుచుండును. ఏడేనా మన తగవు దీర్చునది?

కృష్ణ—గోపాలా! సుతిమించి రాగములోఁబడుచున్నది. నామదేవు పిచ్చివాడా? వాడివంటివాఁడు మనలోనెవడున్నాడో చెప్పుము? తగవుతీర్పుకే వాడు పనికిరాడుగా?

[ప్రవేశము—నామదేవు భజనసేయుచు.]

అ ను బం ధ ము. ౧.

నామ—[చేతులు జోడించి] దేవా! పాండురంగా!

సీ. ఇంకింప సంసారపంకంబు భానుబిం
బము భవదీయనామ స్తవంబు
దారిద్ర్యనిస్తంద్ర ధారుణీజముగూల్ప
నిశిత కుఠారంబు నీదుభజన
దుర్వారగంభీర దురితానలంబార్ప
నమృతంబునీదు నామామృతంబు
ఘనభీకరగభీర కష్టాంబునిధిఁదాట
నిరపాయమగునావ నీదుసేవ

గీ. భయపిశాచంబుఁ దోలఁగింప భస్మపటలి
పద్మనాభ! భవత్పాద పద్మరజము
ఘోరతాపత్రయోత్పన్న పీడార్తిమారకంబు
తనరు నీనామకీర్తనం బనఘచరిత!

(బాలురఁగాంచి స్వగతము)ఏమి యీబాలుర మాఢ్యము? చతుర్దశభువనరక్షణ దక్షుండగు నాహార్యక్షు నిభమధ్యునారాధింపక తిరిక జెందు వేళ శైశవక్రీడలందుఁ గాలమువృధఁబుచ్చుచు నామమాత్రావశిష్టులగుచున్నారు. భగవన్నామ సంకీర్తనామృత పానంబునకు నిరలజిహ్వికలు మరలినచో నొందుశైశవక్రీడా రసపానంబునకు నిచ్ఛగించునే? (ప్రకాశము) మిత్రులారా! ఏమిది? ఇట్టులగోలికాయల నాడుకొనుచుంటిరేల? అన్నిఁటికిని మూలకారణుండగు శ్రీమన్నారాయణుని సేవలకన్న నీయాటలన్నియు నెక్కుడగునా? శైశవదశనుండియే యైహికేచ్ఛలకు లోనుగావలయునా?

కృష్ణు—అయ్యా! మాకీ గొడవయంతయు నెందులకు? మీరటు చూచి యేకాయదూరమున నున్నదో తెలిపిపొండు. మాకదియే పదివేలు.

నామ—(పరికించి) సోదరులారా! చూడుఁడీరెండుకాయలు సమదూరముననున్నవి. ఆరెంటి కేమాత్రమును భేదములేదు. అందులకుఁ గారణమెయ్యది! మీకిద్దఱకు సమమైన గురినిల్పుటఁజేసియేకదా యిట్టులజరిగినది? ఇందన్నిఁటికంటె నెక్కుడు మీచిత్తంబులన్నియు నీయాటయందు నిమగ్నములైయుండినవి. కాని యట్టి నిశ్చలమగు గురిని మనపాండురంగనియందు నిల్పి, యాతనిభజనలే శైశవక్రీడలని నమ్మి నిరతముఁ బూజించుచుండినచో నప్పుడు మానవునకు, భగవంతునకు నెట్టి భేదములుండవు దశలయందున శైశవదశ మొదటిది. ఆదశయందు బాలురు కేవలమజ్ఞానులై యిహలోకసంబంధములగు నాటపాటలకు లోనగుచుందురు. తదనంతరము నవయౌవనులై విషయవాంఛలలోఁజిక్కి వికారులై తిరిగినచో నప్పుడు భగవంతునకు మానవునకు భేదముగలుగును. కాని శైశవ దశనుండియే యాకమలాక్షుని భజించుచుండిన నట్టివారలిహపరంబులయందుఁ బూజార్హులగుదురు.

మ. స్వరమందుక్ మనమందు వర్తనమునక్ భక్తిశ్రియాభ్యర్థులై
పరతంత్రుల్ భగవంతు శేషశయనుం బద్మాక్షుఁ బీతాంబరుక్
నిరతంబుక్ భజియించు సాధుజనముల్ నిత్యోదయశ్రేయులై
స్థిరభోగంబులనందఁజాలుదురు లక్ష్మీనాథుధామంబునక్.

గోపా—అయ్యా! తగవుఁదీర్చెదవని గంపెడాసతోనుండ భక్తిభక్తి యని బోధఁజేసెద వెందుకు? పక్షమునకు రెండు దినములే లేనియు శైశవక్రీడల జరుపవలదా? బాల్యదశయందే ముక్కుమూసికొని మూలఁగూర్చుండు మనియెదవా యేమి? ఇక మీ బోధలఁ గట్టిపెట్టి చేతనగుచోఁ దగవుఁదీర్పుము. లేకున్న మీత్రోవను మీరు పొండు.

రాము—ఏమిరా? కోలగాయలాగున గలగల నఱచెద వెందుకు? ఆయన యెవరనుకొంటివి? మనవలె నజ్ఞానుఁడుగాడు ఎప్పుడేనియు నాతఁడు మనతో నాటలకు వచ్చునా? అట్టివానిని దిరస్కరించుట తప్పుగాదా? (నామదేవునిదిక్కు) అయ్యా! బాలుఁడవయ్యును సాధుమూర్తివి. బాలురమగు మనకు భగవంతు నెటులఁ బూజింపవలయునో తెలియదు. ఒకవేళ తెలిసినను భగవంతుఁడు బాలురమగు మనలఁ గన్నుఁ(?)ఁ జూచునా? ఎవరో యోగులు చాలకాల మడవులయందుఁ దపంబు సేసినను వారలకు భగవంతునిఁ జూచుట కష్టతరము మన పెద్దలు చెప్పుచుండ వినుచుంటిమి. అదిగాక మనకు లోకజ్ఞాన మేమియు లేదు. అట్టితఱి మనకు భగవంతునిఁ గాంచుట కష్టతరముగాదా?

నాము—సోదరులారా! పరాత్పరుఁడు సర్వసముఁడు బాలురైనను దపోనిధులైనను నాతనిదృష్టికందరు సమానులే బాలుర హృదయంబులు లలితపల్లవ కుసుమంబులు. భగవన్మహిమల నెన్నించుటకు లోకజ్ఞానమువలదు. మీకు నాటలయందుండు నాతురతను నా పాండురంగని భజనలపై నుంచి యవియే శైశవక్రీడలనియెంచి యేకమనంబున నెల్లప్పుడు 'రంగా'యను

రెండక్షరముల జపించుచుండినచో నాదేవదేవుండు మనల నప్పక నుద్ధరించును. పసివారలు లోకజ్ఞానము నెఱుంగకం బోవుటం జేసి వారి యాత్మలకు షడ్భావవికారంబులు లేవు. నూతన వస్త్రమునకుం బట్టినట్టుల రంగు పాతవస్త్రమునకుం బట్టదుగదా? అక్కారణ బాలుర హృదయంబుల నూతనముగా నెయ్యదియేని యలవడినచో నది జన్మపర్యంతము వఱకు నిలచియుండును. బాలురకు బుద్ధికుదిరినచో వారలకుండు మనోనిశ్చలత్వము పెద్దలకేనియునుండదు. మనకా పాండురంగని చింతనయందు గురికలిచినచో, నంత నది పోనుపోను గాఢముగా నాటుకొని తుదకుం దన్మయత్వముం గలిగించును. తపసులు లోకజ్ఞానులగుటచేం గొందఱొకవేళం గామాతురతను పతితులై పాపమార్గంబును ద్రొక్కుచుందురు. దానంజేసి వారలకు భగవంతునిం జూచుట కష్టతరమగును. అట్టియెడం దపోనిధులకలవిగాని, కష్టంబుల నిష్టింప బాలురకు సాధ్యమా యని యోచింపఁదగునా?

సీ. పలుకష్టములఁ జేసి ప్రాభవోపేతుఁడౌ
ప్రహ్లాదుఁడును బసివాఁడు కాఁడె?
పరతత్త్వరసింప వనమందు భగవంతు
సేవించి ధ్రువుండు చిఱుతగాఁడె?
యముని గెల్వఁగఁ జాలినట్టిమార్కండేయ
మునిసింహుఁడును జిన్నిబుడుతగాఁడె?
పరమేశ్వరునికంటి బాధను దొలఁగించి
కొలిచిన కన్నప్ప కుఱ్ఱగాఁడె?
గీ. కడగి సలుప నసాధ్యపుఁ గష్టమని
సాధ్యమగునంచుఁ బల్కరే? సాధుజనులు
బాలురకు సాధ్యమే? యంచుఁ బలుకఁదగునె?
బాలకులు గారె? తొల్లింటి భాగవతులు.

బాలకులారా! భగవంతుని లీలలఁగురించి చెప్ప నలవిఁ గాదు. ఆతనిని సేవించుటకు వృత్తిభేదములుగాని, జాతిభేదములు గాని యంతకుమున్నే తారతమ్య భేదములుగాని లేవు. ఎవ్వఁడు నిశ్చల చిత్తంబున నాభగవంతుని స్తుతియించునో, వాఁడు త్రిలోకములందుఁ బూజ్యుఁడగును ముందు శ్రీకృష్ణనామ సంకీర్తనంబలవడుటయే దుస్సాధ్యము. అలవడినచోఁ గడచినకొలఁదియు నాకీర్తనంబుపైఁ బ్రేమ జనించి, కడకదియే భక్తిరూపముగాఁ బరిణమించును. అట్టిభక్తిచే శ్రీమన్నారాయణునిఁ దృప్తిఁబరుపవచ్చు ఆతఁడు తృప్తిపడిన సర్వభూతములుతృప్తిపడును. అంత నాభక్తుఁడు సర్వభూత సమన్వితుఁడగును.

కృష్ణు— అయ్యా! మేమంతటివారము కాఁగలమా?

నామ— సోదరా! భగవచ్చింతన సేయుచుండినచో నంతటివారము కాఁగలము. శ్రీకృష్ణభజనంబు సేయుదమురండు.

అనుబంధము. ౨.

[అందరును భక్తిపారవశ్యమున నుందురు.]

నామ—(ముకుళితహస్తుఁడై)

శా. శ్రీకృష్ణా! యదునందనా! భవహరా! చిద్వ్యాపకా! యీశ్వరా!
పాకారిప్రముఖార్తిసంహరణ! నిన్ వర్ణింపఁగాశక్యమే?
లోకస్తుత్యభవత్పదాంబుజ సుధాలోలాంతరంగంబులన్
జేకూర్పంగదవయ్య! మాదృశులకున్ శ్రీపాండురంగప్రభూ!

బాలకులారా! ఆలయంబున కరిగి స్వామిని సందర్శింతము రండు.

[నిష్క్రమింతురు.]

(తెర వ్రాలును.)

## ౨వ రంగము. వామదేవు గృహము.

## [ ప్రవేశము దామాజీ - గుణాబాయి. ]

(దామాజీ యేబదియేండ్లు నిండినవాఁడుగా నుండవలయును. వేషధారణము శిరమున మహారాష్ట్రపాగయును నొకముదుక చొక్కాయును దానిగుండీబిరింపు లేదమ బుజమునుండి క్రిందుగా నుండవలయును. గుండీ బిరింపులు దారములతోగాని లేక గుడ్డబొత్తాములతోగాని యమర్పఁబడవలయును. ఆచొక్కాపై వల్లెవాటుగా నొక పంచయుఁ గంఠమునఁ దులసిపేరులుండవలయును. కట్టుకొనుటకు ముదుకధోవతియు తగ్గునెరాను మీసాలు జారి జారినట్లుగ నుండవలయును. మోమున వైష్ణవనామము లుండవలయును. గుణాబాయి ముప్ఫదియేండ్లకు నిండిన దాంగాగను వేషధారణము కులకాంతలకువలె నుండి శిరమున ముసుగు మాత్రముండవలయును. నామకోపు మొదటి రంగమునందలి వేషములో నుండవలయును)

గుణా— నాథా! పిల్లవాడు నవవయస్కుఁడగు చున్నాఁడు. కాని లోకజ్ఞానమే లేదు. ఎల్లప్పుడున్నాదునివలె హరిభజనల సల్పుచు సన్యాసిమాడ్కిఁ జరించుచున్నవాఁడు. పురవాసులందరును బిచ్చివాఁడనియు మందమతియనియుఁ బలుదూష్యమలనాఁడుచున్నారు. కులవృత్తియగు వ్యాపారమును మాని యెల్లప్పుడు హరిభజన లాలసుండగుచో వృద్ధులమగు మమ్మల ముందు పోషించుటెట్లు? మీరెన్నినోచూచి యూరకుందురు. ఒక్కనాఁడేనియు మీవెంట వ్యాపారమునకుఁ దోడ్కొని పోరు. దానియందలి సాధకబాధకముల నెఱుఁగకపోయినచో ధనమార్జింపఁగలడా? ధనములేమి మనలేముకదా? పుత్రుఁడు మాటవినక పాప్రియమునంతయు వ్యర్థసేసినచో మనకు గతులున్నవా? బాలునకు హరిభజన లెందుకు? బాల్యమునుండియే భక్తి నార్జింపవలెనా? గృహస్థాశ్రమస్వీకారుఁడగు లటి మోక్షసామ్రాజ్యమునకుఁ బట్టభద్రుండు కాఁగూడదా?

దామ— కాంతా! ఏమినీమాహాత్మ్యము? హరిచింతనామృత పానంబునకు వేళయొకటియున్నదా? గృహస్థాశ్రమవాసుఁడై మోక్షసామ్రాజ్య ధురంధరుండగునని తలంచుటెట్లు? మానవుని జీవితంబు క్షణభంగురముకదా? క్షణమునకుఁ గలుగబోవు సంగతిఁ దెలియఁజాలమే. అట్టిచో ముందు చేయఁగూడదా

యని తలంపనగునా? మన పుత్రుఁడు కారణజన్ముఁడుకాని సామాన్యుఁడుగాఁడు. పద్మము వికసించుచునే సౌరభ్యమును వెదఁజల్లునట్లు లాతని హృత్పద్మము వికసించుచునే భక్తిరసమును వెదఁజిమ్ముచున్నది ఆతఁడు సాక్షాద్విష్ణ్వాంశసంభూతుఁడుగాని మానవమాత్రుఁడుగాఁడు. మనమాతని మనస్సీమయందు భక్తిబీజమ్మును నాటుటకుమారు మొలచినదానిని త్రుంచుట పాడియగునా? సంసారసాగరంబున నాతఁడిప్పుడే మునుంగనేల? భక్తవత్సలుండగు పాండురంగని కృపయుండినచో నిర్ధనులేనియు జీవింపఁగలరుగదా. నీచెడు తలంపుల మాని యాతనిభక్తిరస ప్రవాహమును నిరోధింపకుము. మనమిదివఱకాతని కెప్పుడును, గృహబాధల నిర్వర్తించుకొనుమని చెప్పితిమా? ఇప్పుడు మనము చెప్పినచో నాతఁడు మన పల్కుల శిరసావహించునుగాని కాలఁదాచివేయఁడు. పరమ భక్తులకుఁ బ్రాపంచిక విభవంబులపై నాసయుండునా? పరమ భాగవత శిఖామణియగుటచేతనేకదా ప్రాపంచిక సౌభాగ్యములన్నియు నిరర్థకంబులనియు నిష్ప్రయోజనంబులనియు నీకు నకార్యణించెనె. అట్టి సుపుత్రునిఁ గన్నందులకు గర్వపడక యెవ్వరో లోకులు కాకులవలెఁ జీకుమాటల నాడుచుండిరని లోకజ్ఞానశూన్యుఁడనియు నున్మాదుఁడనియు సన్యాసియనియు దూరనచ్చునా? 'పరబుద్ధివినాశాయ' యను సూక్తినేనియుఁ దలంపవలదా?

గుణా—నాథా! మీరును భక్తిమార్గము ననుసరించి నాకు బుద్ధి గఱపుచుంటిరా? ఒక్క గడియయేనియుఁ బుత్రుఁడింటికడ నుండక సదా వీథులందు భజనసేయుచుఁ దిరుగుచుండునేకాని [illegible]నారలు నవ్విపోదురని యెంచడే? భజనసేయుటకు గ[illegible] లేదా యేమి?

దామ—[illegible]ము నీపిచ్చితలంపుపాయలేదా? మనము తగినకాలమున భ[illegible] సంప్రకొనుమని తెల్పినచో నాతడక్కరణి వర్తించును.

దానంజేసి జీవులు కృతకృత్యులుగాఁజాలరు. నీవును దీరిక వేళలందు భగవద్ధ్యానంబును సల్పుకొనుచుఁ గులవృత్తిని సేయుచుండుము. కోటివిద్యలున్నను గులవృత్తికి సమానములుగావు.

నామ — అన్నా! నీయాజ్ఞ శిరసావహించువాఁడ.

దామ — తండ్రి! కొంతవఱకు లౌకిక జ్ఞానమునుగూడ పాటింపవలయును. నీవు వీధులయందుఁ దోడివారలఁగూడి భజనలు సల్పవలదు. వారిలోఁ గొందఱు స్వార్థాభిలాషులుందురు అట్టివారలు నిక్కమైన భక్తులుగారు. ఉదరపోషణార్థమై యెదిరి కన్నులఁ గప్పి కుటిలగతి వర్తించుచుందురు. అట్టివారల నెఱుంగుట దుష్కరము. వారలతోఁ గలసియుండుట కాకులగుంపునందుఁ గోకిలముండినట్లగును. అదిగాక —

శ్లో. సత్సంగతేస్సాధుగుణా భవంతి
దుస్సంగతో దుష్టగుణా భవంతి
నదీషుతోయాన్యమృతాయితాని
ఘోరాణితాన్యేవభవంతిసింధౌ.

అను సూక్తికేవడి సద్గుణుడైనను గొన్ని వేళలందు దుస్సాంగత్యమువలన మతిభ్రంశకలుగుచుండును. చిత్తచాంచల్యము గలవానికి భక్తి కుదురదు. కుదిరినను రక్తికిరాదు. పలువిధదుర్జనులతోఁ గలసియుండిన నేదియో కళంకముగలిగి ప్రధానవస్తువునకు భంగము వాటిల్లుచుండును. కాన మనగృహమునందే పూజామందిరమునందు దేవుని ధ్యానచిత్తంబున సత్కాలము సలిపి భక్తినాయి సేవించుచుండుము.

నామ — తండ్రి! మీ యాజ్ఞ దాటఁగలనా? అట్లె యొనర్తును.

దామ — సుతా! చెప్పమఱచితిని. నేనొక కార్యార్థమై యుదయంబునఁ బోవువాఁడ. మనము ప్రతిదినంబును మన యింటియందుఁగల పాండురంగనికి నైవేద్యమును బెట్టుచుంటిమి. ఎప్పటియట్ల నేను లేనికొఱఁతమాన్పి పాండురంగనికి నైవేద్యంబును సమర్పింపుము.

నామ—(జనాంతికముగ) ఇంటియందుంగల రంగనికేల? ఆలయంబున సాక్షాత్కరించియున్న రంగనికే నైవేద్యమును బెట్టివచ్చెద.

గుణా—నాథా! ఇప్పుడు చెప్పిన చొప్పున నొప్పుకొనును కాని భక్తులెవరైనం గన్పడినచోఁ బనినంతయు వదలి యొక్కపక్కగుఁ బోవును. అంత మన యాచారంబునకు భంగము వాటిల్లునేమోయని దిగులొందుదాన.

నామ—(హర్షముతో) తల్లీ! నాపై నెంత పామరత్వమును వహింపుచుంటివి? కైటభారికి బువ్వఁబెట్టుటకన్న మిన్నయగు గర్జం బొండుగలదే? నాపాండురంగనికి— ననుగన్నతండ్రికి— నానోములపంటకు— నాపాలిదైవమునకు— నాచేతితో నైవేద్యము నర్పించుటకంటె నొండుభాగ్యంబుకలదె? తండ్రీ! నాకెట్టియానతి నొసంగితిరి? ధన్యుఁడనైతి. బాలుఁడనగు నేనిడు మృష్టాన్నము నారగించునా? నాపైఁ గనికరముఁ జూపునా? నన్ను బ్రేమఁ బాలించునా? పసికూనవని కసరికొట్టునేమో? లోకజ్ఞానమెఱుంగనివాఁడనని పలుకరింపఁడేమో? (చకితుఁడై) ఎంతటి మూఢుఁడను? భక్తులన్నఁ బాండురంగనికిఁ బ్రాణములంతో సమానముకదా? అట్టితఁడె నన్నేల కనికరింపఁడు. నానోములు ఫలించినవి. నాయన్నము తరించినది. జయపాండురంగప్రభూ!

అనుబంధము ౨.

(భక్తపరవశుఁడగును)

నామ—కాంతా! చూచితివా? ఇట్టి భక్తులు మాటదప్పుదురా? నేఁ జెప్పిన కైవడి నాతఁడు తప్పక వర్తించును.

గుణా—కానిండు రాఁబోవువానికిఁ జింతించు టెందులకు? ఎయ్యది కానున్నదో యయ్యదికాక మానదు. అంతయుఁ బరాత్పరుని యధీనము. [నిష్క్రమింతురు.]

---

## అనుబంధము. ౬.

ఉ. హారివి ఘోరపాపభయహారివి దుష్టయశేత్రుకోటి సం
హారివి గోపబాలకవిహారివి మంజులసద్గుణాఢ్యలం
కారివి సాధుచిత్తహితకారివి భక్తజనాంతరంగసం
చారివి నిర్వికారివి విచారివి శౌరివి నందనందనా!

దేవా! నీమాయ లనంతములు – అగణితములు. నినువర్ణింప నేరికి తరంబు? నిర్వ్యాజకరుణారసపూరిత హృదయుండవై నిరుపమ సద్గుణగణాలంకార శోభాయమాన మానసరాజహంసుడవై పాండురంగాద్యనేకావతార సంభూతుండవై యొప్పు నీనామవర్ణనంబర్ణ వంబుగదా? తండ్రీ! విముఖత్వమేల దాల్చితివి? కాలభేదమెంచితివా? వృత్తిభేదమెంచితివా? పిన్నపెద్దయను తారతమ్యమెంచితివా?

సీ. శూద్రాన్నమునుదింట శుద్ధిగావన్నట్టి
భక్తుడు విదురుండు సాక్షిగాడె!
బాలుంపొసంగిన ఫలము లెంగిలివన్న
శబరకులాంగన శబరిసాక్షి!
పిన్నవారలపొత్తు వెన్నగూడిపెట్టన్న
బాలురు ముద్దుగోపకులుసాక్షి!
పేదవారలపైని ప్రేమకూడదటన్న
గడుదరిద్రుడు కుచేలుడునుసాక్షి!

గీ. భక్తులమొరాలకించెదు ప్రభుడటంచు
బుధులెలనుగాచు కరుణాసముద్రుడనుచు
నిన్నిసాక్ష్యము లొక్కటై నిన్నుదడిపి
యుండ; జాగేల! భవభంగ! పాండురంగ.

(స్వగతము) అయ్యో! యింకనురాలేదే (ప్ర) తండ్రి! కనికరములేదా? మొఱవినరాదా? అపవాదా! భక్తుడనుగాదా? ఇదివాదా? రక్షకుడవుగాదా? మోమోటములేదా? కుచేలుని

శా. అన్నా! పెద్దయుఁబ్రొద్దునీపదనమందత్యంత సంతోషసం
పన్నంబైన మనంబుతో నిటుల సంభావించినన్ నిన్ను నన్
గన్నారంగనుజూడవేమి? కరుణన్ గాపాడరావేమి? యా
పన్నానేకజనావనా! మహితదేవా! పాండురంగప్రభూ!

(దుఃఖించుచు) స్వామీ! ఇకను గనికరము లేదా? నన్నుఁ బ్రోచుటవాదా? మున్ను పుండరీకునిఁ బ్రేమాకులితస్వాంతంబునఁ జేపట్టితివే? ఎంత వేడినను గరుణ లేదా? ఇంకెంతని కొనియాడుదు? ఇంకెంతని సన్నుతింతు? ఇంకెంతని నీనామచింతన సేయుదు? భక్తుల పాలిఁటి కల్పభూజమను సంకల్పంబు వికల్పమయ్యెనా? భక్తులపై నుంచు భావమిదియేనా? నిన్ను సేవించుట దుఃఖాకులితస్వాంతుల గుటకేనా? వరదుఁడనను బిరుదము వమ్మయ్యెనా? నన్నుఁ బ్రోచుటకు శక్తిలేదా? అట్టిచో సర్వశక్తిపరిపూర్ణుఁడను దానికి సార్థకము లేదా? దేవోత్తముఁడవనికదా నిన్నుఁ గొలుచుట? ఉత్తమశబ్దంబు లుత్తవోయెనా? నీపదకమలంబుల భజించెడు నన్నుఁ గృతార్థునిఁ జేయవేల? అర్థిజనకల్పభూజా! యుష్మత్కరుణాకటాక్షం బొక్కపరి నాపైఁ బ్రసరింపవా? తండ్రీ! తనయుని తప్పుల సైరింపుము. నీ పుత్రునిపై శత్రుత్వమేల? అన్నా! నిర్వ్యాజకరుణారసపరిపూర్ణసంపన్నా!

దండకము.

జయజయ శ్రీపాండురంగా! కృపాదివ్యసత్సంగిరంగా! భవద్భక్తచిత్తాబ్జభృంగా! సురారీంద్రసంకల్పభంగా! సితభక్తాలిసంరక్షణోద్దానుదివ్యాంతరంగా! నినున్నమ్మి భక్తిక్రియాసక్తినై, సంతతధ్యానలోలుండనై, సంస్తుతింపన్ గృపన్ జూడవేలా? దరిన్ జేర్పవేలా? కృపాలోల! పాలింపవేలా? విలోకింపవేలా? జగత్ప్రాయకా! నాపైఁ గోపమేలా? చలంబేల? నిద్రాణమున్ జూచి తుష్టాత్మునిం జేయవేలా? ఫలాహారమత్యంతసంప్రీతిభక్షింపవేలా? సదాచారమున్నిల్పవేలా? రమేశా! పరేశా! సురేశా! మహేశా! లసచ్చిత్ప్రకాశా! నమస్తే నమస్తే నమస్తే నమః ॥ [ధ్యానలోలుఁడగును.]

(ద్వారము తెరువఁబడును పాండురంగడు ప్రత్యక్షుఁడు)

పాండు—కుమారా! భవద్భక్తికి సంతసించితిని; లెమ్మా

నామ—(కనులువిప్పి యెదుటఁ బాండురంగనిఁ గాంచి) ఆహా! నా యదృష్టమెట్టిది! వర్షంబులకోలఁది నుష్ణాతపంబులకు సహించుచు గాననంబులఁ గందమూల ఫలాశనులై ఘోరతపంబుల సల్పు సంయమీంద్రుల కందరాని దర్శనం బీనాఁడనాయాసంబుగ నందఁగంటినిగదా? [చేతులు జోడించి] దేవా! సర్వశక్తిపూర్ణప్రభావా!

అనుబంధము. ౭.

మ. భవవారాశిని నీదులాడుచును దేవా నాకిఁక ధన్యుఁడై
భవదీయాంఘ్రిసరోజములఁ గొలువ సద్భావంబుసంధిల్లఁ ద
క్కువతాపంబులు వాల్చి ప్రోచెదవు; స్వామీ భ్రాంతచిత్తుండనై
భవసంకం బెగరింప దిక్కెవరు దేవా! పాండురంగప్రభూ!

[అని ప్రణమిల్లును.]

పాండు—(లేవఁదీసి) కుమారా! క్షుధాగ్ని దహించుకొని పోవుచున్నది. నాకింత యన్నంబుఁ బెట్టవా!

నామ—[హర్షముతో] ప్రేమరస మొలికిపోవుచున్నది. ఆహా! భక్తవాత్సల్య మెంత సుఖప్రదాయకము. అన్నా! ఈయాసనంబునఁ గూర్చుండుము.

[కూర్చుండఁజేసి పళ్ళెరమును ముందుబెట్టును]

పాండు—(ఆరగించుచు) కుమారా! నాయంకతలంబునఁ గూర్చుండవు రమ్మా. [అని చేరదీసికొనును.]

నామ—అన్నా! ఈభక్ష్యంబును నేతిలోముంచి తినినచోఁ గమ్మగా నుండును. [ముంచి నోటికందిచ్చును]

పాండు — (మైమరచి) కుమారా! తల్లియైన నింతశ్రద్ధతోఁ గుడువ బెట్టునా? ఇట్టి భక్తులఁ గలిగియున్నచో నాకింక వలయునదే మున్నది! ప్రపంచమంతయుఁ బాపభూయిష్ఠ మగుచున్నది. నిష్కళంకభక్తిచే నన్నుఁ బూజించువారలరుదు. పెక్కుమంది సహేతుక భక్తులేకాని, యహేతుక భక్తులు లేరు. ఈకలియుగంబున జనులందరుఁ గలిమాయాపరవశులై కించిద్భోగంబుల కాసఁజెందుచు, దురాశాభోగసముద్రితస్వాంతులై కేవలము జ్ఞానశూన్యులగుచున్నారు. నన్ను మఱచుచున్నారు. భగవంతుఁ డొక్కఁడున్నాఁడను మాట వారి బుద్ధికిఁ బొడసూపదు. ఏవంకజూచినను స్వార్థాభిలాషులే. పరోపకారమను మాటయే లేదు. ఇహమే శాశ్వతమని యెంచుచున్నారు. పాపకార్యంబులను వెనుకంజ వేయుటలేదు. కులాచారంబులఁ బాలించుట లేదు. వృత్తిభేదంబును జూపుటలేదు, వర్ణసంకరమగుచున్నది ఒక్కభక్తుఁడైనను గానరాడు. మనస్స్థైర్యమును బూనుటయు లేదు. జనులందఱల్పబుద్ధి చేతస్కులై యస్థిరచిత్తులగుచున్నారు. పాపము పెరిగిపోవుచున్నది పుణ్యము నశించుచున్నది. జపదానధ్యయనాదికర్మములు నా[illegible]మున్నవి. విప్రులందఱు వేదాధ్యయన సంపన్నులమని చెప్పుకొనుటయే కాని శేషశేషిత్వంబుల నెఱింగినవారొక్కరు లేరు. లోకమంతయు నన్ను మఱచి నోరులేని రాయొక రాతిబొమ్మనని తలంచుచున్నది అంతయుఁ బురుషయత్నమే కాని దైవయత్నమొకింతయు లేదని పలుపురుషులు భంగులఁ బలుకుచున్నారు. కొందఱు హరిభక్తులమని చెప్పుకొనుచు నుండగవారలచే నరకకింకరాంతకు నాథుఁడనైన నాకపఖ్యాతి వాటిల్లఁజేయుచున్నారు. ఎచ్చోటఁ జూచిన డంబాచార పరాయణులే కాని శిష్టాచారసంపన్ను లొక్కరు లేరు. అధర్మము మూఁడుపాదముల నడచుచున్నది. జగము మిథ్యయని నమ్ముటలేదు. జగద్రక్షకులము దేశబంధువులము మేమేయని పేరుగల వారందఱు విఱ్ఱవీఁగుచున్నారు.

పుత్రా! నీయట్టిభక్తులు నాకు లభించుటరుదు. నీభక్తి నిష్క-
ళంకము — నిరుపమానము — నిర్వ్యాజకరుణారసపూరితము
ఇట్టి భక్తులకు నేను నమ్రుండను. వారి యధీనుండను.

నామ — తండ్రీ! నీచింతనామృతపానమందరికి లభించినచో సమవర్తి నిరుద్యోగచక్రవర్తియై వర్తిలవలయునుగదా? కలిమాయా పరవశులగువారికిఁ గన్నులుండియుఁ దనుకుడ్యంపు రంధ్రములవలె నిష్ప్రయోజనంబు లగుచున్నవి. ఐహికసుఖంబులన్నియు వనచంద్రికావైభవములనియెఱుంగక యజ్ఞానాంధకారంబునంబడి చటులకుటిలతిమిరపటల ప్రచండమార్తాండనుగు భవన్నామచింతనంబుమఱచి కలిమాయాకులితస్వాంతులగుచున్నారు. అట్టితఱి —

శ్లో॥ పరిత్రాణాయసాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామియుగేయుగే॥

అట్టి నీసంకల్పంబు ననుష్ఠింప ధర్మసంస్థాపనంబునకై యింకెప్పటి బాహ్యంగావతారంబున వెలసితివి. ఇంకను జనులు మూఢులగుచున్నారు. పాపాచరణ చేసియుంగూడ నెట్టన సుఖించుచున్నారు. కాలమహిమ వర్ణనాతీతముగదా తండ్రీ!

[నేపథ్యమునఁ జప్పుడగును]

పాప — (వికటనర్తనము చేయుచు) [illegible]! ఎవ్వరో వచ్చు సడి యగుచున్నది. ఇంక మసలుట కర్తవ్యముగాదు. పాపులకు నాదర్శనంబు దుర్లభంబు. వచ్చువారలు పూజారులై యుండనోపు. వారు నాద్రవ్య మపహరించు వారలే కాని నిక్కంపు భక్తులుగారు. వారలకు సమాప్తియు లేదు. నన్నుఁజూచినచో వారు మందలింతురు. జ్ఞానభక్తులమని చెప్పుకొనుటయే కాని వారికి భక్తియన నెద్దియో తెలియదు. ఈపూజారులందరు దుష్టులు.

మీదుమిక్కిలి యొక్కొక వేళ నన్నే ధిక్కరించుచుందురు. అట్టివారలు నన్నుఁగాంచ లేరు. వారలఁజూచుటయే నాకు ప్రాణాంతకమగును. నిశ్చలత్వము లేక నన్నెంత పూజించినను వారలకు నాదర్శనంబొసంగను. ఇఁక నేనిచ్చోట నిలువఁ గూడదు. నీవును బొమ్ము.

[అదృశ్యుఁడగును]

నామ—(విషణ్ణుఁడై) అయ్యో! రంగా! అప్పుడేపోవుచుంటివా? పోకు పోకుము ఒక్క గడియ నిలువుము. ఇసీ! అయ్యో! నిలువ వేమి? అంత తొందరయా? అబ్బా! ఏమి యాశ్చర్యము! మేకను గాంచి మెకము వణంకినటులున్నదే! దుర్జయదానవ కంఠీరవ కంఠలుంఠనుఁడవై యవక్రవిక్రమ పరాక్రమంబున నకుంఠిత తేజుఁడవైన యొప్పునీవును దుర్జనభయంబు నందు చుంటివా? అవును. దుష్టునకు దూరమున నుండుట సమంజసమని పెద్దలు చెప్పుదురుకదా?

[ప్రవేశము—గుణాబాయి]

గుణా—(స్వగతము) కుల్లాలయంబున కరిగి పెద్దయుఁ బ్రొద్దయ్యె. ఆలయంబునకరిగెనో లేక భక్తులెవ్వరేనిఁ గన్పడవారి వెంట నరిగెనో? అబ్బ! పుత్రునిఁగన్నందులకు ఫలము సంతతముఁ జింతలపాలగుటయేకదా? ఇంతకును భగవన్నివేదనమునకు భంగిము వాటిల్లియుండదుకదా? కానిమ్ము. ద్వారము చెంత కరిగిచూచెద.

[పోవుచుండ నామదేవు వచ్చుచుండును.]

నామ—(ఆశ్చర్యముతో) తల్లీ! ఏమిది? ఇచ్చోటికి వచ్చితివేల?

గుణా—నీవు రాక మసలుటచే నిచ్చోటికే తెంచితి. కుమారా! ఇంత యాలస్యమేల చేసితివి?

నామ—అమ్మా! ఏమని చెప్పుదును? పాండురంగ డెంతవఱకు నివేదనము నారగింపక తడయుటవలన స్వామినిఁ బ్రతిమాలి యాహారంబు నారగింపఁజేసి వచ్చుచుంటిని. దానఁజేసి యాలస్యమయ్యె.

గుణా—(ఆశ్చర్యముతో) భగవంతుఁడేమి? ప్రత్యక్షమైయాహారంబు నారగించుటేమి? లోకములో లేనిసంగతినిఁ జెల్పుచుంటివి. పూజారులైనను జెయ్యిచూపువారేకదా? పాండురంగడు నీకుఁ బ్రత్యక్షమై యాహారంబునారగించెఁగా? బొంకినను బదిమంది నమ్మునటుల బొంకవలె. మార్గంబున క్షుధార్తుల కెవ్వరికో కుడువఁబెట్టి నేను కోపగింతునని యీతీరున బొంకెదవా? హరిభక్తుఁడవై జ్ఞానసంపూర్ణుఁడవై తుదకొక యనృతంబాడి నీ భక్తిసంతతియుఁ గళంకముఁ జేసితివే? తండ్రీ! నిజముఁ జెప్పిన నేను కోపగింతునని భయపడితివా? నన్నిన్నిమారులో మూఢురాలవని మందలించితివే? ఇప్పట్టున నీవెంతమూఢుండవైతివి?

నామ—తల్లీ! నన్నెంతమూఢునిగా నెంచితివి? నాభక్తికిఁ గళంక మాపాదించితివే. నాప్రాణనాయకుఁడగు హరి యే సమయమందేనియు నాభక్తి నిష్ఫలముగానీయఁడని నమ్మినాను. లోకమెంతపాపభూయిష్టము? కమలంబుఁబోలె సాధుసత్తముఁడు, కన్నతండ్రి హూడ్కిఁ గాపాడు నాపాండురంగనికి నివేదనముఁ గుడువఁబెట్టక, మోక్షకాంక్షఁ జెల్లించితిమిగదా యని యుబ్బితబ్బిబ్బులాడుచు భగవన్నివేదనమును దామె యాహ్వాయనంబుగ నారగించుచు, హరిభక్తశేఖరులమని చెప్పుకొనుచుండ్రై ఱతస్కరులై నిర్లజ్జగు నీపూజారులు పూజార్హులా? హా! నాపాండురంగని కిన్నమే పెట్టుటలేదా? మీరును బూజారులవలెనే భగవంతుని సేవించుచుంటిరా? ఎంతటిమూర్ఖము! ఇట్టివారలకు భగవంతుడు ప్రత్యక్షమగునా? భగవంతుని విత్తంబును దస్కరించినవారలకు జన్మరాహిత్యమున్నదా?

ముందు జన్మంబున నట్టివారు గుక్కలై పుట్టుదురే? ఈపూ
జారులందరును భగవంతుని సొమ్ము దినువారలేకాని భగవం
తునిఁ గొలుచువారలుఁగారు. అట్టివారలే నిక్కంపుహరిభక్తు
లని నమ్మి సేవించువారలెంతటి వివేకహీనులు! ఇదియుంతయుఁ
గలిమాయా పరవశులగుటఁ జేసి చేకురినదోసము.

గురా — కుమారా! ఏలపూజారులదూషించెదవు? వారలకున్న లోక
జ్ఞానము భక్తిశ్రద్ధలు నీకుఁగలవా? నిరంతరము భగవత్సాన్ని
ధ్యమున వసించుచు భగవన్మహిమల సంపూర్తిగా నెఱింగిన
యర్చకులు పూజార్హులుగాక యెప్పుడో యొక్కపరి భగవ
న్నామచింతన సేయుచు నొకమూలఁ గూర్చుండి ధ్యానించు
వారలు పూజార్హులగుదురా? నీచెప్పిన కైవడి పాండురంగఁడు
భుజించినచో నాయెదుట నీ పాలనుఁగూడ ద్రావింపుము.
పాలీయ మఱచితిని.

నామ — [సంభ్రమముతో] నన్నుఁ బరీక్షింపఁదలఁచితివా? అమ్మా!
భగవంతుఁడిచ్చటఁ గలఁడు — అందు లేఁడు — అను సందేహము
వలదు. ఆతండు సర్వవ్యాపకుండు. ఎందు వెదకిచూచిన నందే
గలఁడు. అట్టివాని నెవ్వరేనియు స్థిరచిత్తంబున వాసుదేవుని
ధ్యానించిరేని నప్పరాత్పరుఁడు తప్పక ప్రత్యక్షమగును. కాని
యేకచిత్తంబున భగవత్సాన్నిధ్యంబున నిల్చి కలకాలముఁ
బ్రార్థించినను బ్రత్యక్షము గాఁడు అట్టివారల డాంబిక భక్తు
లగుదురు. కలియుగంబున ధనమే ప్రాణాధారము. నిరాడం
బరమున కాధారము లేదు. వేషము లేక భాష యున్న దానికిఁ
గాలము కాదు. ముందు వేషమే ప్రధానము. భగవంతునకు
వేషము ప్రధానముగాదు. గుణము ప్రధానము కాని జగ
మంతయు వేషమును గాంచి భ్రమపడుచున్నది మొగంబునఁ
బట్టెనామంబులఁ దీర్చి కర్ణములు వెలుగునట్లు రత్నఖచిత కుండ
లములఁ దాల్చి దుకూలాంబరముల ధరించి బయలుదేరినచో
నట్టివాడు దుర్గుణుఁడైనను వేషమువలన వానికి గౌరవంబబ్బు

శ్లో॥ ఏకో౽పి గుణవాన్ పుత్రో
నిర్గుణేనశతైరపి
ఏకచంద్ర ప్రకాశేన
నక్షత్రైః కిం ప్రయోజనమ్॥

అనుకరణి నీయట్టి పుత్రుఁడొక్కఁడే చాలు. నాతండ్రి! రమ్ము.

[చేరదీసి ముద్దాడును]

**నామ**—అమ్మా! చాల తడవైనది. గృహమునకేగుదము. రమ్మ.

[నిష్క్రమింతురు]

ఇది ప్రథమాంకము.

---

ఓమ్.

# భక్తనామదేవు

## ద్వితీయాంకము.

### ౧వ రంగము. అరణ్యము.

([illegible])

[కిరాతవేషధారులగు రుక్మిణీ కృష్ణులు ప్రవేశము]

కృష్ణు — కాంతా! భక్తుఁడగు నామదేవు గురువు లేక కొఱంత బాపుకొనుటకై యిటు రాఁగలఁడు. ఇచ్చోట మనమాతనిని రెండు విధముల పరీక్షలయందుఁ దగుశ్రద్ధఁ జేయవలయు. వీసోబా కేచరునిఁ గుమ్మరి గోరాయనువారల నేర్పాటుజేసి యుంచితిని. అతఁడే తగినగురువని చెప్పి యింతవాతని సమానమును బరీక్షింపవలయును. రెండవదియగు భూతదయను బరీక్షించుటకై మనమీ కిరాతవేషమున జంతుమారణముఁ జేయుచుండవలయు.

రుక్మి — నాథా! నిన్ను నమ్మి సేవించువారల నిట్టి విషమ పరీక్షలఁ జిక్కించుటేల?

కృష్ణు—ఏమిటి కాంతా! యింతగా నవ్వుచుంటివి ?

సీ. తండ్రి నొక్కనిఁగూర్చి దరిలేని కష్టాలఁ
గల్పించి ప్రహ్లాదుఁ గాచినాను
వనచరంబులఁ బెంచి వనముల నలయించి
వనచరు నొకనిఁ గాపాడినాను
ఘోరాటవుల నిరాహారంబు నొడఁగూర్చి
మునిపుంగవులఁ బ్రేమఁ బ్రోచినాను
చింతలఁ గుప్పించి సంతసమడిగించి
యలమటవెట్టి నిన్నరసినాను

గీ. భక్తులను బలుబాములపాలుజేసి
రక్షణముసేతు మన్ననో రాజ్యమందు
ముక్కుమూలాటు తడవ్రుగా మోగ్రలనిలచి
ప్రోచువాడను నేగాను పాలతిమిన్న.

రుక్మి—అన్ని వేషములకుఁ దగియుండు మీకు మాటలు రాకుండునా?

కృష్ణు—(దిక్కులు పరికించి] కాంతా! నామదేవు వచ్చుచున్నాడు.
మనకృత్యము నింక నిర్వర్తింపవలయు.

కిరా—యెంకా! మత్తుగింజలేయన్నా యెత్తుకొచ్చాయంటే.

యెంకి—మత్తుగింజ లేదుండయిరా! ముందు వలపన్నరావంట్రా.

కిరా—ఏందలె పిచ్చెక్కిందాయేం? వూరికే వలేత్తే యేంపటతా
యనుకున్నా.

యెంకి—పిట్టల పడతావనుకుంటుండావట్రా? సీపిట్టమాంస మోరి
క్కావాలె. లేడిమాంసం యెత్తకరా.

కిరా—ఓశ్ లేళ్ళకేమే బల్లమీాద తోలకరానంటా. ఏదీ వుండేలు
బద్దియ్యి. ఒకసెయ్యి సూపిత్తా.

[వుండేలుబద్ద దీసికొనును]

మెంకి—(నలుదిక్కులు పరికించి) అదుగోనశ శెవులపిల్లి పోతుందది. సూత్తానుంచుంటా యెందుకు ?

రా—యెట్టిమొగంలాగ మాటాడతా యెందుకు ? గురి సూసుకో వద్దా ? దీని పానంతీయకుంటే నాయేటకాడితనం యెందుకు ! శెల్ రాంజోశ్

[తుందేలును బడగొట్టును]

యెంకి—ఈడ లేళ్ళగుంపులు యిరియిగాలేవు గాని అడివిలోకి పోదాం పదరా.

[పోవుచుందురు]

కిరా—(తొందరతో) అశనియెట్టిగాల. యెంకో! వలేతాం రాయే. అటుసూడే యెన్ని లేళ్ళుమందో. అమ్మబాబో కల్లు తిరిగిపో తుండాయిగండే. రాయే. వలపట్టుకొనియెయ్యె.

(ఇద్దరు పన్నుదురు)

యెంకి—నోరు తెరుసుకొని ఆడ కూకుంటా యెందుకు ? ముందుపోయి ఆటినంత వలకేసి అదిలిచ్చికరారాదు.

(కిరాతుఁడట్లు జేయ గుంపంతయు వలలోఁబడును

యెంకి—(ఆతురతతో) కత్తందుకోయింక. ఆకలి మండిపోద్ది.

కిరా—ముంపు బానపొయ్యిమీదెయ్యె. యీటంటి సంపితే మన పొట్ట నిండుద్దిలే.

(కోయుచుండును)

యెంకి—(మాంసమంతయు బానలో వేయుచుండును]

( ప్రవేశము : నామదేవు )

నామ—నేను గురువుసకై కదా బయలుదేరినది. అదేమి పాపమో కాని నామనంబునకు నచ్చినవాఁడొక్కఁడు గాన్పింపడు. తిరిగి తిరిగి వేసారుటయే కాని సఫలీకృత మనోరథుఁడఁ గాజాలనైతి. ఎన్నిచోటులయుందని వెదకుదు ? ఎంతదూర మని యేగుదు ? ముందు మార్గమును జూపువాఁడొక్కఁడును లేడే. గురువు నాకు లభింపడాయేమి ? కట్టా ! దైవఘటన

మెంతచిత్రము. ఇంతదనుక పాండురంగని యాలయంబున స్వామి సేవామృతంబుఁ గ్రోలుచు నిర్విచారంబున నుంటినే. ఇప్పుడో ? యొక్క కర్జంబు నిర్జించు నుపాయంబుఁ గానక విచార వారాశింబడి కొట్టుకొనిపోవుచుంటినిఁగదా. ఆహా ! భగవద్భజనమహిమ యెట్టిది ?

అ ను బం ధ ము

(ముకుళితహస్తుఁడై) రక్షా ! దుష్టజన శిక్షణదక్షా !

సీ. నీపాదకమలంబు నియతినై మ్రొక్కెడి
శిరము శిరంబది పరమ సుగుణ !
నీనామమధురంబుఁ బానంబు సేసెడి
జిహ్వక జిహ్వక శేషశయన !
నీపూజల సతంబు నేపారసల్పెడు
కరము కరంబది సరసిజాక్ష !
నీచింతనముఁ జేసి నిశ్చలంబునుబొందు
డిష్టము డిష్టము త్రిజగవినుత !
గీ. నిన్ను వీక్షించు కన్నులు కన్నులహహా
నిను ముదంబున వినుతించు మనము మనము
రాజితాంగ ! సుజనమనోరంగ దురిత
భంగ ! రిపుభంగ ! శ్రీరంగ పాండురంగ !
(కొంతతడవు ధ్యానమనస్కుఁడగును)

[దిక్కులు పరికించి] ఆతపంబుకతంబున జంతుసంతానంబులు తరుగుల్మలతాదుల పొంతడాగుచున్నవి. ఆహా ! తరువొకటి పరోపకారి.

గీ. దన్నియుండిన జనుల బడలికఁదీర్చు
నిలువఁజాలని క్షుధుల యాకలినిఁబాపు
స్థలవిహీనుల కిరవగు తావుఁగూర్చుఁ
దల్లితోఁ బోల్పఁజెల్లును దరువొకట.

కొంతతడవీ తరుచ్ఛాయను విశ్రమించెద.
(చదికిలఁబడి యోజనానిమగ్నుఁడగును)

మొఁకి— మంచివాసనొత్తుండదిరా నామొగడ. [మూతఁదీసి] ఎందళ్ళెంతేశినా అడుక్కే పోద్ది. ఇంకా కొన్నిట సంపరా. ఇయ్యాల పొట్టపగిలేతట్టు తిందాం.

కిరా— ఏం సంపటం ఆశ. కోసికోసి నాసేతులు నెప్పెత్తుతుండాయి.
(అట్టులే కోయుచుండును)

నామ— (మాటలసందడి నాలకించి లేచి ముందసరిగి యాదృశ్యమునుగాంచి యదరిపడి) ఆ! ఆ! జంతుహింసయే! హరిహరీ! ఎంతటి భయానకము? ఎన్ని జంతువులు? హా! నోరులేని జంతువుల కెవరు దిక్కు? ఉదరపోషణార్థమై యొరుల ప్రాణములఁ దీయుటయా? పాపము! వాని ప్రాణములెంత ఘోషించుచున్నవో? మానవు లక్కటికముఁ జూపనిచో జంతువులు జీవింపఁగలవే? ఈకిరాతునకవి యెగ్గేమి యొనర్చె. (సహింపఁజాలని భావముతో) ఓరోరి క్రూరాత్మా! సాధుమృగంబులఁ జంపుటకు నీకరంబులు కరంబుత్సాహమందినవా? భూతంబుల గారించిన భూతంబులు గారించునని యెఱుంగవా? ప్రాణముకైఁ దీపి యందరకు నొకే కరణియని తెలంపవా? (శాంతభావంబున) అయ్యో! నేనెంత మందమతిని? కిరాతుని దూఱుచుంట నేల? కాలము దాపరించినచోఁ గాల్జుఁదేనియుఁ గూలిపోవునుగదా. మృత్యువే కిరాతరూపంబుఁ దాల్చి వానిఁ బరిమార్చుచుండె. ఆపన్నుల రక్షింప నాపన్నగశయనుకన్న నొండు రక్షకుండు గలఁడే? నాతండ్రీ! పాండురంగా!

సీ. ఇదిగదా? సమయంబు మొదలంటఁగూల్పంగ
జీవహింసావిధిఁ జిక్కియాత్మ!
ఇదిగదా? కాలంబు హీనచిత్తులకహిం
సా గుణంబును దెల్ప సదయహృదయ!

ఇదిగదా? యనను దుర్మదకిరాతుల చిత్త
ముల దయ నెలకొల్పఁ బురుషసింహ!
ఇదిగదా? తఱి జగదీశుని మహిమలఁ
జాటింప జగమున సత్స్వరూప!

గీ. లోకమా! హింసమయము కల్లోలములను
జీవహింసయ పరమ సంసేవనంబు
పాపభూయిష్టమా యెఁ బ్రపంచమంత
కరుణఁగాపాడుమో శౌరి! ఖలవిదారి!

అయ్యయ్యో! ఈజంతుహింస నేఁజూడఁజాల. ఎంతఘోరము. (కొంతతడవాలోచించి) కానిమ్ము. వానికడకేగి కొంత నీతిని గరపి జంతుహింస మాన్పింప యత్నించెద. [వెళ్ళును]

కిరా — ఓరయ్యో మీరు? అడివిలోపడి ఒక్కడివే యాడికెల్తుండా వంట?

యెంకి — ఓరే తే నీకెందుకురా? నీపన్నా పు సూసుకోరాను. ఇంకా కొన్ని జీవాల్ని సంపు. మాంసం కడుపునిండాసాల్దనిశోస్తుది.
(కిరాతుఁడు కోయుచుండును)

నామ — అబ్బబ్బా! కిరాతులారా! ఏల యీరీతిని జంతుహింసఁ జేసెదరు. కాయగూరలఁ దినినచోఁ గడుపునిండదా? ఇన్నిజంతువుల ప్రాణముల జానెడు పొట్టకై చంపుట భావ్యమా? మర్త్యులు జ్ఞాన చేతస్కులని యెన్నఁబడినందులకు సార్థకముఁ జూపవలదా? తనకు నొప్పి కలిగిన నెంతబాధయో యెదిరికిఁ గూడ నంత బాధకలుగునని తెలుపవలదా? ఈ సాధుజంతువులు జరులకేమి బాధాకరములని హింస సేయుచుంటివి?

కిరా. — ఓరయ్యో! యేట్లో తెగసెపుతుండావు. యింస యింస యనివరా పొద్దత్తమానం మొత్తుకుంటావెందుకు? పిచ్చోడా! యింసలేని సోటొకటుందా? యీబూమి యీనుబ్బ యీ

తాగే నీలు యీయన్ని జంతుమయం గావా? యీటిలో యాడ యింసకాకుండ ఉంటద్ది? బూమిని దున్నేతప్పుడు నాగేటియంచు గుచ్చుకోని యెన్ని పానాలు సత్తుండాయి. ఇంకా నీలు తాగేతప్పుడు యెన్ని జీవాలు పోతుండాయి. మనం నడిసేతప్పుడు మన పాదాలకిందఁబడి యెన్ని జంతువులు సత్తుండయి. ఇదంతా యింస కాదంటయ్యా! బలే యీదాంతి కిమల్లే సెప్పొత్తా యెందుకు?

మొంకి—ఊరుకోరాదంట్రా! నీకెందుకీసుద్దులన్ని? మనమా త్తెరంయీ నకి తెలిత్తే యిందుకు సేత్తుండవురాయని యడుగుతాడూ? యెట్టి మొగాలకి సుద్దులు తెలుత్తాయంట్రా!

నాము—కిరాతా! నీపల్కులు నిర్కువంబులు. పంచభూతంబులు భూతమయము. దానఁజేసి సర్వముహింసామయము గావచ్చును కాని యవియన్నియు మనచేతిమీఁదుగా జరుగుటలేదు. ఎఱుఁగక చేయు కార్యములన్నియుఁ బ్రబల దోషాకరములుగావు. బాలుఁడు బాల్యావస్థయందెన్నియో దుష్కృత్యముల నాచరించుచున్నాడు. అవి యన్నియు దోషములగునా? అజ్ఞానకృతదోషములని వానినన్నిటిఁ బెద్దలు పరిగణింతురు. కాని యిదిమంచి యిదిచెడుగు అని తెలిసిన పిదపఁ జెడుకార్యములాచరించినచో నవి ప్రబల దోషములగును. జంతుహింస పాపాకరంబని యెఱింగియు హింసయొనర్చినచో దానికివియన్నియు నుదాహరణములు గాఁజాలవు. సుగుణులగువారు భూమిమీఁద నడచునప్పుడు సాధ్యమగునంతవరకు జంతుమారణము నాపుచుందురు. అట్టియెడ నజ్ఞానమునఁ జేయు కృత్యములు హింసాకరములని యుదాహరణములుగాఁ గైకొనవచ్చునా?

కిరా—అయ్యా! ఎఱిఁగిసేత్తే దోసమని సెప్పితిరిగంద. దీనికి సత్తెప్రమానంగా శెప్పుతాయిను. రాజులందరు యెఱిఁగికోళ్ళేగందా? ఆరందరు అడివికి యేటకెళ్ళి యేటకేసు జంతుల్ని సంపటం లేదా? అది పాపం గావాయని ఒకన్ని అడిగితే అది మా

దరమం అని సెప్పుతారెందుకు? అరి దరమంలో యింసనేస్తే మంచిదని రాసుండిందాయేంది?

నామ—సప్తవ్యసనములలో వేటయొకటి యని మనకుఁ బురాణములు తెల్పుచున్నవి. అట్టియెడ వేట హింసాకరముగాదని యెవరు చెప్పఁగలరు? దుష్ట శిక్షణము శిష్టరక్షణము అనునవి క్షాత్రధర్మములు ఆ ధర్మసంస్థాపనంబుకై రాజులు క్రూర మృగంబులవేటాడి జనుల రక్షించుచుందురు ఒకవేళఁ గ్రూర మృగంబులఁ జంపుటయు హింసయైనఁ బరోపకారమున దానఁ జేకూరు పాపమిగిరిపోవునని సమర్థింపవచ్చు. కాని నీవు చంపిన జంతువులన్నియు సాధుమృగంబులు. వీని వలన జనులకు బాధలు కలుగవు. దానఁజేసి పరోపకారకృత్యమిది కానేరదు అట్టియెడ నిది హింసయగుఁగాని యహింస కానేరదు.

కిరా—ఓరికో పరులకు మంచికలిగితే శేశేపాపాలన్నీ పోతయ్యా? ఆయిదంగా పోయ్యేట్టయితే మాకుమాత్తరం యేంపాపం ఉంటద్ది? మేమ్మాత్తరం పరోపకారం సెయ్యటం లేదాయేం?

నామ—వీనినిజంపి నీవెవరికుపకార మొనర్చుచుంటివి?

కిరా—ఓరికెందుకు సెయ్యాలంట? మాంపానాసికి మేమే సేసుకుంటాం. మామణుసుకు దేనిమీదకోరికుంటే దాన్నెల్ల యెత్తుకొచ్చి పెటతాం. అప్పుడు మామణుసు కుపకారం మేంసెయ్యటం లేదాయేం?

నామ—తినకుఁదాను చేసికొనుట స్వార్థమగునుగాని పరోపకార మెట్లగును?

కిరా—సవార్థమెందుకవుద్ది? నాపానం నేను యేరేకాని మేయిద్దర మోటికాము. యిద్దరోటేఅయితే సచ్చేతప్పుడు ఓరిపానం ఆరెంట పోవెందుకు?

యెంకి—నీకెందుకురా యీసుద్దులన్నీని? ముందీడ బానలో మాంసం యేమాత్తరం లేదు. ఏంతేసినా బానదుక్కే పోద్ది

గాని నిండనే నిండదక. ఇంకా కొన్ని జంతుల్ని సంపకరా పొయ్యి. ఈడకూకుంటే యేంవుండది. (నామదేవుని కై-) ఓయి నువ్వేటివయ్యా ? మా పానం మీదిప్పుడే పడ్డావు.

కిరా— అశనీయెట్టిగాల ? ఎంతేసినా అడుక్కే పోద్దంటాయేంటే ? శిమిడిపోద్దేమో సూడే.

(అని లేచి పోంబోవును)

నామ— కిరాతా ! ఆగుమాగుము. జీవహింసం జేయుట మానుము.

కిరా— మానుకుంటే మాంసం యేడదొరుకుద్ది ?

నామ— మాంసమా ? ఆకులలంబులందిని బ్రతుకవచ్చు.

కిరా— ఓరు సెప్పారయ్యా నీకు ? యెట్టా ? పానాన్ని సంపుకోమంటావా యేం ?

నామ— (చిఱునగవుతో) కిరాతా ! ప్రాణముపై నీకెంతటి ప్రీతియో యున్నచో సకలభూతములకు నట్టులనియె భావింపుము. ఒక్క ప్రాణమునకే నీకింతటి యారాటముండ ప్రాణకోటికిం కెంతటి యారాటముండునో యూహింపుము. నీచే జంపం బడిన ప్రాణు లెంత ఘోషించియుండునో నీ సుఖమాత్రము నూహింపవైతివి. ప్రాణములన్నియు జలబుద్బుదసమానములు. ఎప్పుడేనియు నేపులివాతనో యేగోతియందునో పడి యీశరీరములు నశించిపోవును. ఇట్టి యశాశ్వతశరీర పోషణార్థ మింతవరకుం జంపిన జంతువులు చాలక యింకను జంపుచుంటివా ? ఇంతటనైన మానుము.

కిరా— నీమాటయిని తెరితరాలనట్టి వత్తుం కులయిద్దెని మానుకోమంటావా యేంటయ్యా ?

నామ— (కడువిచారముతో) హరిహరీ ! జీవహింసనే మీకుం గుల వృత్తియయ్యెనా ? హాకృష్ణా ! జంతుమారణము నీకిం దగిన వృత్తియని భావించితివా ?

ఉ. అడవులయందుఁ బచ్చికల హాయిగ మేసెడి సాధుజంతులన్
విడువక జీవహింస కులవృత్తియటంచుఁ గుతారధార్యులై
దుడుకుతనాన నెమ్మఁ చి త్రుళ్ళుచుఁ దూలుచుఁ జంపువారలీ
యిడుములఁ బాపి కావఁదగదే? మురమర్దన! యోజనార్దనా!

యెంకి — కడుపంటుకపోతావుంటే ఉపన్యాసాలింటా కూకుంటె బొట్ట కూడెక్కడ దొరుకుద్దిరా ?

[ఆతురమునఁ గిరాతుఁడు పోఁబోవును]

నామ — కిరాతా ! నాబొందిలోఁ బ్రాణము లుండునంతవరకు నీవు జీవహింసఁ జేయఁజాలవు. నేఁజూడఁజాలను.

(అడ్డముపోవును)

కిరా — అయ్యా ! మూంబుద్ది మేంచేసుకుంటానికి నీవోరివయ్యా అడ్డమొత్తావు. వుండువుండు.

నామ — కులవృత్తియైనను దానికిఁ బరిమితికలదు. కాని నీవన్నదో యద్దానిని దాటిపోవుచుంటివి. అదిగాక —

శ్లో. పరోపకారాయ ఫలంతివృక్షాః
పరోపకారాయ దుహంతిగావః
పరోపకారాయ వహంతినద్యః
పరోపకారాయ కృతోమనుష్యః.

అని ధర్మశాస్త్రములు బలుకుచుండ జీవహింసకై యేల యత్నించెదవు. నామాటవినుము.

కిరా — నీవుపన్యాసాలిక్కడ యినేదెవ్రుతుపో. పెద్దయడిసిగొందని ఊరకుంటావుంటె అదేపనిగా అయుత్తావేమును ? సెపుతున్నా! బెమ్మదేవుడొచ్చినా నన్నాపలేడు. నూవేంటో ఆపుతానంటావేం ?

(పోఁబోవును)

నామ — (పట్టుదలతో) కిరాతా ! నన్ను దాటిపోవ నీతరముగాదు.

[అడ్డముపోవును]

కిరా — [కోపముతో) నిదానంగా సెపుతుంటే యినవాగేం ! నడుంగ నూనోడివి నన్నాపటానికి ? పో ఆతులికి పో.

[నెట్టివేయును నామదేవు క్రిందఁబడును]

నామ — [మిక్కిలి పట్టుదలతో లేచి] కిరాతా ! నానిశ్చితంబువినుము జగమంతయు నీకు సాయమొనర్చినను నామేనఁ బ్రాణము లుండునంతవరకు వహింసఁ జేయఁజాలవు.

కిరా — నీపానంమీదికి నీవేతెచ్చుకొంటుండావు. యీటితోటిపాటు నిన్ను సంపి మరి పోతాసూడు. (మొంకిడికై) మొంకా ! ఆక త్తిట్టివ్యో యీడిపని పట్టిత్తాను. చెప్పితే యినకుండుండాడు. (నామదేవు మెడను బట్టుకొనును)

నామ — హా ! ఇపుడేమిగతి ? (చేతులు జోడించి) పాండురంగా !

అనుబంధము ౧౦

తోహర.

తాటకిమర్దన! యోమురమర్దన! శైవశిఖామణి! సోత్రివఁగ పే
సీటనుముంచినఁ బాలనుముంచిన నీదియుభారమటంచు నిపే
ప్రాణముఁ దృణముగఁ బాయుచునుంటిని బాలసన్నిక సేయఁగ పే
మానుగ భూతదయాపరతంత్రుల మహిమ సఘవృద్ధిని జేయఁగ పే.

[నామదేవు మూర్ఛపడును]

[కిరాతుఁడు కత్తియెత్తును — తెరజారును]

## ౨వ రంగము. అరణ్యము.

(నామదేవుని వేషధారణ మెప్పటివలెనే యుండవలయును. నీరసోబాళోతు దేబదియేండ్లను మించినవాడుగను ముక్కు పలుచగను ఓపిక లేనివానిగను తూలుచున్నట్లుగను జూపట్టవలయును. వేషమున గుప్తరోగిగా నుండవలయును. శరీరమందంతటను గట్లు కట్టుకొని ఈగలు ముసురుకొనుచున్నట్లుగను బాధపడుచున్నట్లుగను నటింపవలయును. వస్త్రధారణము కావిబట్టగూడ కట్టును జడలుగల తలకట్టును పెద్దగడ్డము తగినసమిసమును గలిగి మునివేషమున నుండవలయును.)

[తెరనెత్తగా నామదేవు మూర్ఛనుండి లేచుచుండును]

### అనుబంధము ౧౧.

నామ—(హర్షముతో) ఆహా! పాండురంగనికి భక్తులయందెంతటి వాత్సల్యము. భక్తులకై పలుకష్టములకు లోనగుచుండును గదా. గురునిం గన్గొనంజాలక పలుబాముల నొందుచుంటినని నాపాండురంగడు కిరాతరూపంబున సాక్షాత్కరించి సద్గురుని జూడం దెలిపి యదృశ్యుండయ్యె. కిరాతరూపంబున నెంతయో జీవహింస యొనర్చెంగదా? భగవంతుడేలాకో యిట్టిపనుల సల్పుట? ఏమో పరాత్పరుని చెయ్దములు గుర్తింప నేరికితరంబు! (ఏదియో సందడియగుటను నటునిటుం జూచి) ఏమిది? ఇంతలో నిన్నికురంగము లేడనుండివచ్చుచున్నవి. ఇంతదనుక నీయడవియంతయు జంతుహీనమై యుండెంగదా. ఇదేమో కడువింతగానున్నది. [ఆలోచనమభినయించి] ఓహో! తెలిసినది. మున్ను కిరాతావతారుండగు పాండురంగనిచేం జంపంబడిన కురంగములై యుండనోపు. ఆప్రదేశమునకరిగి తిలకించెద. పరాత్పరుడు భూతదయా పరతంత్రుండుగదా.

[ఆప్రదేశమునకరిగి చూడ నొక్కశల్యమైనం గాన్పింపదు]

ఆహా! ఇదియంతయుం బాండురంగనిలీల. సర్వశక్తిపరిపూర్ణుండగు వానికిం జేయంజాలనికార్య మొండుకలదా? భూతదయాస్వాంతుండగుట మున్ను తనచేత సమసినశవవిసరమ్ములనుగురంగములను బ్రతికించినాండు. నామనస్తాప మిప్పటికి గతించి

నది. ఆహా! నేనెంతధన్యుఁడను. భగవంతునిలీలల వర్ణించు భాగ్యముకాక తనివిదీర గాంచుభాగ్యముకూడ లభించినది. (భక్తిపరవశత్వమున) తండ్రీ! పాండురంగా! నీచర్యలు వర్ణనాతీతములుగదా? కించిత్ జ్ఞానుఁడగు నేను నిన్ను వర్ణింపఁగలనా?

సీ. లోకపాలక! సర్వలోకపూజితభావ!
భావనాతీత సద్భావమూర్తి!
మూర్తిత్రయాత్మక! మూలకారణదేవ!
దేవాదిదేవ సంభావనాత్మ!
ఆత్మరూపవిహార! హారచిదాకార!
కారణాకారణాకార! ధీర!
ధీరమానసగేహ! దివ్యహర్మ్యనివాస!
వాసవార్చిత! స్వప్రకాశమాన!

గీ. మానసయేణ పికుదాంకి! మునిమచిత్త!
చిత్తరంజన! త్రిపురగజమత్తసింహ!
సింహపీఠిక సురరాజ శ్రీనివాస!
వాసుదేవ! మహాదేవ! వందనీయ!

(నడచుచు) ఈవనమెంత నేత్రానందకరమై యొప్పుచున్నయది. ఆహా! వివిధలతాకుసుమపల్లవితతరుశోభితమై శకుంతసంతానంబుల కాలవాలంబైయొప్పు నీవన మా నందనవనమును మరపించుచున్నది. ఇందు జరించు జీవంబులు ప్రకృతికాంత సౌందర్యాతిశయంబులఁజిక్కి సొక్కుచుండునుగదా. ఏమి ప్రశాంతము? ఏమి సుఖదాయకము? ఇట్టులుంటఁజేసియే మహర్షులు వనములందు వసింప నుత్సహింతురు. (దృష్టి సారించి) అల్లదే కానంబడునది పాండురంగదాస తిచ్చిన నాగనాథస్వామి దేవాలయంబైయుండనోపు ఏమియీ దేవాలయపు విలాసము.

ఉ. ఆకసమంటు గోపురమహో యనుపించెడి చారునూతనా
నేక మణీకవాటములు నేర్పునఁ దీర్చిన విగ్రహంబు ల
స్తోకములైన కుడ్యములు శోభితకాంతులనీను ద్వారముల్
షోకల చాయలన్గనినఁ బోలవు తక్కటి దేవళంబులున్.

ఆలయమే యింత సుప్రసిద్ధమైయుండ నిక నాలయంబుననుండు మహానుభావులెంతటివారలో కదా? తినఁబోవుచు రుచులడుగనేల? పాండురంగనిచేఁ దెలుపఁబడిన వారలు మహాత్ములు గాకుందురా? (స్పర్శమభినయించి) ఏమిది? నాహృదయమేలొకో గుడిసమీపించిన కొలఁది దడదడకొట్టుకొనుచున్నది. ఓహో! పెద్దలకడకేగునప్పుడు చిన్నవారలకుండు లక్షణమే కదా? ఆమహాత్ముఁడు నన్నుఁ గరుణఁ జూచునో చూడఁడో! సద్గురుఁడగువాఁడు కరుణామయుఁడు గాకుండునా? ఏలనాకీ వృథాచింత. ఆమహాత్ముని దర్శించినచో నన్నియుఁ దెలియఁ గలవు.

[గుడిని సమీపించును—ద్వారమును దెఱచును]

(ఆశ్చర్యాసహ్యములతో) అబ్బా! ఏమి యీ దుర్గంధము? భరింప శక్యముగాకున్నదే. హరి హరీ! ఇందెవ్వరైన జీవహింస సేయుచుండిరుగదా? అహింసాపరులిందున్నచో నీదుర్గంధమునకుఁ గారణమేమి? (స్మృతి నభినయించి) ఇదియునుగూడ పాండురంగని కృత్యమై యుండవలె. కిరాతవేషంబునఁ బరీక్షించినది చాలక, యిప్పుడిచ్చోట నీదుర్గంధమును గల్పించి మరల బరీక్షించుచుండె. కానిచో నింతటి దుర్గంధము లోకమున నెందైనఁగలదా? అబ్బ! ఎంతయత్నించినను ముందునకుఁబోఁజాలకుంటినే. అయ్యో! పోకున్న నెట్లు? (ముందంగవైచును. తిరిగి బయటికి వచ్చును)

(పవనస్పర్శమనుభవించుచు) ఆహా! పుష్పాదుల మేన నలందుకొని యపరాలిపోవునేమోయను భయంబున మెల్లనఁ గదలుచీమారుతుఁడెంతటి యానంద మొసంగుచున్నాఁడు. పాపము! ఇట్టి పవనస్ప

ర్యముఁ బడయఁజాలక యాదుర్గంధవారాశిని దొప్పదోగు నా ప్రాణి యెట్టిదో కదా? (కొంతవడి యోజించి) ఓహో! నేనిచ్చోటఁదడయు చుంటినేల? నావచ్చినకార్యము పూర్తికావలదా? (విరక్తిభావమున) దుర్గంధమున కైగదా భయంపడివచ్చితి? ఏమి నాపిచ్చి తలంపు! ఎంత మందమతిని! ఈ నాశరీరము దుర్గంధయుతముగాదా? నేను దుర్గంధమున మునిఁగియుండలేదా? చిత్తమా! ఎంత భ్రమనందితివి?

ఉ. చెందిన రక్తమాంసములు చీమునరంబులు శల్యసంతతుల్
క్రిందుగొనన్ స్వరూపమునఁగ్రాలు కళేబరసీమయందు నే
చందముతో సుగంధకణసంతతి డిందుపథంబుగందు? దు
ర్గంధమె పర్శభూమిని సికారులొనర్పఁగ మూఢచిత్తమా!

[అని లోనికేగును]

[పీసో బాకేశునిఁగాంచి] ఆహా! ఏమి యీతపశ్శాలి తేజము! ఈతఁడెవ్వఁడో సంయమివర్యుఁడై యుండనోపు. పాపము! కర్మపరిపాకము చేతఁ గుష్ఠరోగియయ్యె కట్టా! తపోనిధియని యెన్నఁబడినను గర్మబద్ధుఁడైయుండవలసినదే కదా! పురాకృత కర్మఫలంబుల ననుభవింపకతీరునా?

ఉ. ఎంతతపంబుఁ జేసిన మహెంతటి తీర్థములందు గ్రుంకినన్
జింతన సేసినన్ బురుషసింహులుపిలిలల భక్తియుక్తిన
త్యంత ధనాఢ్యుఁడై ఘనసుఖాంబుధి మగ్నతఁ జెందినన్ వృథా
చింతయకాని యెల్లరును జిక్కుదురే మొదఁ గర్మబద్ధులై.

విరించి చేష్టలతిచిత్రములుగదా? సుందరునకుఁ గురూపిని, కురూపునకు సుందరిని, గర్భదరిద్రునకుఁ బుత్రసంతతియు, భాగ్యశాలి కనపత్యతయు, సన్మార్గులకు ఖేదంబును, దుర్మార్గులకు మోదంబును గూర్చుచుండును. ఎచ్చోటనేనియు రత్నమునకు సరియైన రత్నమబ్బునే? పురాకృత కర్మానుభవమునఁగదా యెల్లజీవులు జగన్నా

టకరంగంబునఁ బాత్రలధరించి తమ తమ ప్రదర్శనాకౌశలముఁ జూపి యంతమొందుటకై? పాండురంగఁడీతఁడే తగిన గురుఁడని తెల్పియుండె. కుష్ఠరోగియైనను నీతనికే శుశ్రూషలొనర్చి పరమార్థమెఱింగెద.

[సమీపించి యదరిపడి] కటకటా! ఈమహాత్ముఁడెట్టి పాపకార్యమునను లోనైయున్నాడు. భువనత్రియ జీవసంహారణమూలకారణమూర్తియు — క్షీరసాగరమథనకాలజనితదందహ్యమానహాలాహలభక్షకుండును — సర్వాక్షరాఖర్వగర్వప్రతాపదీపనిర్వాపణమహాబలుండును — అగు ధూర్జటి శిరంబున — పావన గంగాతోయమ్ముల సతతము మునుంగు శిరంబున — కంటకసమానములగు బాదములు పెట్టెనే? పురాకృత కర్మఫలంబున నియ్యేడఁ గుష్ఠరోగియయ్యెఁ దిరిగి పునర్జన్మ సంభూతుఁడగుటకై యీమహాదేవు నవమానించుచున్నవాఁడే. అయ్యో! పాండురంగా! ఎట్టిమహాత్మున కెట్టి విపద్దశఁదెచ్చి పెట్టితివి ఈ కృత్యము విపరీతముగదా? ఏమో, మహాత్ముల చర్యలు కడు విపరీతములు. తొల్లి కుంభసంభవుఁడు సముద్రోదకంబును మూఁడు పుడిసిళ్ళుగాఁ గ్రోలె. కౌశికుఁడు సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసె. అక్కంటే నిదియొక మహాత్ముని చర్యయేమో? లేక నా పరిశోధనకు పన్నిన పన్నాగమో? కానిమ్ము నాకీ గొడవలేల. మహాత్మా! నమస్కారము. (పదములంటి మ్రొక్కును)

విసో—(ఉస్సురనుచు) అయ్యో! అయ్యో! పాపాలి కింకరుఁడనైతినే? అబ్బబ్బా! నీనమస్కారము తగిలిపోను. కురుపులన్నియు రేగెఁ గదా?

నామ—(భయముతో) స్వామీ! అపరాధము క్షమింపుము.

విసో—అయ్యా! క్షమాపణలు తరువాతఁ గావచ్చును ముందు కొంచెమువిసరి పుణ్యముఁగట్టుకొమ్ము.

నామ—(చెంతఁగూర్చుండి విసరుచు) మహాత్మా! సకలము నెఱింగిన మహానుభావులరగు మీకు ముక్కంటి యుత్తమాంగంబునఁ బాదంబులుంచుట భావ్యమనితోఁచెనా?

విసో—కుమారా! నేనేమి చేయుదును? ఇచ్చోటనుండి లేచుటకు శక్తి యణుమాత్రమేనియు లేదు. భావ్యముగాదని తోచినచోఁ దొలఁగించి పుణ్యముఁగట్టుకొమ్ము.

(నామదేవు పాదములుదీసి యొకచోట నుంప నచ్చోటను శివలింగముపైననేయుండును. ఆశ్చర్యముతో రెండుమూడుపర్యాయము లట్లు చేయఁ దొంటిమాదిరియే జరుగును.)

నామ—[ఆశ్చర్యమున స్వగతము] బాపురే! ఇట్టివింత నెందైనఁ గంటిమా? చంద్రశేఖరుని శిరంబునఁ బాదములుంచుట పాపంబని పాదములు దొలఁగింపఁ యథాస్థితియే సంభవించె. ఆహా! ఆమహాదేవున కీమహాదేవుని పాదములు శిరోభూషణములయ్యెఁగాబోలు. లేనిచో సమస్తదేవాసురముని కిరీటప్రభాభాసమాన చరణారవిందుఁడగు నాగంగాధరున కీతని విగ్రహించుట యొక్క దగ్గ యక్కఱమా? యతీంద్రులకుఁ జతుర్దశభువనంబులు వశమగువలసినవే కదా పాండురంగనికే నచ్చిన పురుషుఁడు మహాత్ముఁడుగాక సామాన్య మానవుఁడగునా? ఈతఁడే యజ్ఞానతిమిరభాస్కరుఁడు. ఇంతదనుక నీమహాత్ము నెట్టుల భావించితి? నిప్పుగప్పిన వహ్నియని యెఱుఁగకపోతినే? ఎంతయజ్ఞానుఁడనైతి. కాని మహాత్ముఁడగు వానికీకుష్ఠరోగ మేల ప్రాప్తించెనో? (ఆలోచించి) పలుప్రాప్తించెనని తలంప నేటికి? నన్నుఁ బరీక్షింపఁ బాండురంగనిచే నియమింపఁబడి యిట్టి వేసముఁదాల్చియుండనోపు. రంగా! నీమాయ లసదృశములుగదా. లేనిచో జగంబునఁ జూడఁజాలని యిట్టి కుష్ఠరోగియగునా? ఏమిది? దుర్గంధ మునుముంచుచున్నదే. కానిమ్ము. మహాత్ముల సంపర్కంబువలన దుర్గంధమును సహించుకొనక లెక్కయా? (ప్రకాశము) స్వామీ! ఈయజ్ఞాను ననుగ్రహింపుడు.

వీసో—[గద్గదస్వరమున) అయ్యో— ఈకుష్ఠ......రోగిపై......గురు భావ......మేలయుంచె......దవు. నోటమాట......లేనియీ ......నిర్భాగ్యుడు......నీకు పర ......మార్థమును ......... బోధింపఁ......గలఁడా ?

నామ—[చేతులు జోడించి] స్వామీ ! మీ సందర్శన కతంబుననే యీ మూఢుని మౌఢ్యము కొంత సమసిపోవ నిఁక దర్శనా ధార భూతునకుఁ బరమార్థ మెఱుక లేదనిన నమ్మఁగలనా? దేవా ! తమబోటి యతీశ్వరుల కృత్యంబులు వర్ణనాతీతములు గదా ? అల పరాశరుండు మత్స్యగంధిని యోజనగంధిగా మార్చె. అలగౌతముఁడు విరూపాక్షుని సహస్రాక్షునిఁగాఁ జేసె అట్టిచో నన్నుఁ బరీక్షించుటకై యట్టి రూపంబున నుంటివేకాని సాక్షాత్కుష్ఠరోగివి కావుగదే? ఈ మీ సేవకుని చేత సేవఁజేయించుకొనుఁడు.

(పాదములొత్తును)

వీసో—(నోటిమీద చెయ్యివేసికొని) అయ్యయ్యో! నీవు నాకెక్కుడ దాపరించితివి. ఓయి దేవుడా ! కుష్ఠరోగిఁగాఁ జేసిన యది చాలక యీ మూర్ఖుని నాపాలి కాలకింకరుఁగాఁ బంపితివే. హరిహరీ ! తొలుదొల్తనే బాధచేఁ గుందుచుండఁ బైని యీతని సపర్యలు మఱింత బాధింపఁదొడంగె. నేఁడెట్టి కష్టంబు ప్రాప్తించె. అయ్యో! తీపులు మెండగుచున్నవే. (చిరాకుతో) అయ్యా! నీసపర్యలచే నన్నుఁ గష్టపెట్టకుము. నాకేమియుఁ దెలియదు. నీతోవను నీవుబొమ్ము. నాసేవఁ జేసి నీవేమితరింపఁగలవు? అనేక యతీంద్రులిక్కాననంబునఁ గలరు. వారలసేవించి కృతార్థుఁడవుగమ్ము.

(నిమీలితనేత్రుఁడగును)

నామ—[కడుశాంతముతో] స్వామీ ! నన్ను కసిరికొట్టినను మిమ్ము విడువఁజాలను. నామానంబునకు నచ్చిన గురువులు మీరలే.

మీరు పాండురంగనిచే నియమింపఁబడి యిట్టి యవతార మెత్తితిరికాని నిక్కముగ పుష్పరోగులు కారు. దేవా! మీ సురుచిరాంగంబు నీపామరునకుఁ జూపుడు. పరమార్థ బోధామృతంబున నీయజ్ఞానుని జిహ్వకఁ దడుపుడు. దాసునిపైఁ బంతె మూనట దాసజనావనలక్షణమా? తండ్రీ! కాళ్ళఁబడి మ్రొక్కుచుంటిని. రక్షింపుడు,

[పాదముల చెంత సాగిలఁబడును]

విసో—[స్వగతము] పాండురంగని యాజ్ఞప్రకార మీతని సహనముఁ బరీక్షించితి. ఇంకను బరిశోధించుట కిదే మార్గత్వము. ఆహా! ఎంతటి దుర్గంధమును సహించె? ఎంతటి నిశ్చలభావంబున నిలచె? ఎంతకసిరినను దొలఁగిపోవక నేనరోగిన్ని నమ్మి ధూళిధూసరపరివృతంబగు నికటికిసేలపైఁ బాదములచెంతఁ బవ్వళించెఁగదా? ఇట్టి భక్తునిఁ గన్నతల్లిదండ్రుల భాగ్యము గాదా. ఉతనికిప్పుడే చేరఁదీసి తారకమంత్రోపదేశ మొసఁగెద. ఇప్పుడు నాకీమారు వేసమేల? [నిజరూపంబునఁ బ్రకాశము] కుమారా! నీమనోహరుండిదే నీకై వేచి యున్నవాఁడు లెమ్ము.

[లేవఁదీయును వేషము మాన్పును]

నామ—(లేచి సంభ్రమాశ్చర్యములతో) స్వామీ! ఆ కుష్ఠరోగులు మీరయేనా? ఇంతలో నంతటి కుష్ఠరోగ మెక్కడకేగె? ఇదంతయు నాపాండురంగని మహిమ. తండ్రీ! నామస్తకమునైఁ గనికరముంచి మీశిష్యునిగాఁ బరిగ్రహింపుడు.

విసో—కుమారా! నీమనోభావము నే గ్రహించితిని గురూపదేశమునకై నీవిచ్చోటికి చేతెంచియుంటివి. గురూపదేశ మెంతవారికేనియు నుండవలె. అదియే మోక్షమునకుఁ ద్రోవఁజూపునది. రెండవది భక్తి. భక్తికి మూలకారణము నిశ్చలత్వము. నిశ్చలత్వము గుదురుటకు ముందొకదానియందు మనస్సు లగ్నమై

యుండవలె. లగ్నమగుటకుఁ బ్రేమ మూలసాధనము. అట్టి ప్రేమ విషయవాంఛలఁ దగుల్కొనినచోఁ బలుతెఱంగుల విచ్ఛిన్నమైపోవును. అట్లాగని విష్ణుసంకీర్తనమ్మునకు మరల్పవలె. అప్పుడు పైఁజెప్పినవన్నియు నొకటివెంట నొకటిగా లభియించి తుదకు భక్తిగాఁ బరిణమించును. భక్తియందుఁ బెక్కురకంబులు గలవు. అన్నిటియందు రెండు విధములే మనకు ప్రధానములు. అవి హేతుక — అహేతుకములు. హేతుక భక్తియనఁ గారణముతోఁ గూడుకొనఁబడినది. కారణము నిరూపింపఁబడినప్పుడు దానఁ గల్గు భక్తి విషయములందాసక్తియుండును. విషయాసక్తమైన భక్తిచే భగవత్సాన్నిధ్యమును బొందుట దుర్లభము. రక్కసుల భక్తియంతయు హేతుకము. అందుఁజేసి వారలెంత తపశ్శాలురైనను కృతకృత్యులు కాఁజాలరైరి. ఇక నిర్హేతుకభక్తిఁగూర్చి చెప్పనలవిగాదు. నిర్హేతుకభక్తి సంపూర్ణునకు విషయములం దాసమోహము. హేతుకభక్తిచే కొంతకాలమునకుఁ బూర్వకర్మములకుఁ బాల్పడవలసియుండును. కాని నిర్హేతుకమునకట్టి గుణము లేదు. ప్రహ్లాదుని భక్తి నిర్హేతుకము ఎన్నియిక్కట్టులు చేకూరినను నిర్హేతుకభక్తియుతుండగు బ్రహ్లాదుఁడు వాని నన్నిటి జయించి కడకు మోక్షసామ్రాజ్య ధురంధరుండయ్యె. కావున—

ఉ. హేతుకమైనభక్తి ఫలియింపదు దారుణపాపపుంజసం
జాత మనోవిషాద మపహానముజేసి హితోత్తరమైన ని
ర్హేతుక భక్తి కేవల మిదే మగుని పాపసరోజభానుమై
పూతగఁ బూయువా రెవరు? పొందుటమాధవలోకసౌఖ్యముల్.

పుత్రా! పాండురంగని నిర్హేతుకభక్తితో నారాధింపుము. ఎట్టిఫలమునకేనియు నాసింపవలదు. ఆసించినచో నది సహేతుక మగును. కొందరు పురుషార్థములఁ గోరి భగవంతు నారాధింతురు. అట్టిదియంతయు విష్ణు సాయుజ్యమునకుఁ గంటకసమానము.

ఉ. భాసుర రాంభకుంభకుచ భారములబ్బుట దేనికొఱకై? జం
భాసుర వైరిపోలె ననమానసుఖంబుల నందుటెంతె? సే
నాసను భూమిపాలుఁడయి రాజ్యము సేయుట దేనిగొప్ప? భా
కాసుర వైరినెప్డు పరమార్థమెఱింగి భజించు టొప్పగున్.

ఇంతవఱకు భక్తిమార్గంబు నెఱింగితివి. ఇఁక ధర్మసూక్ష్మత నెఱుంగుము. నీకు సమత్వముఁగలుగలేదు. పాండురంగఁ డాలయమందే యుండునని భావించుచుంటివి, అటుల భావింపఁ గూడదు. ఈ సకల చరాచరంబులయందును పాండురంగఁడు సూక్ష్మరూపంబున వర్తించుచున్నాఁడు. అందరును పాండురంగని స్వరూపులే. అందరును పాండురంగని యాజ్ఞాబద్ధులే. తృణమైనను నాతని యాజ్ఞ లేనిది కదలఁజాలదు. ఆత్మయే పరమాత్మ స్వరూపము. నీయాత్మయు నాయాత్మయు నేక స్వరూపములే. ఆత్మను వశపఱచుకొనినచో నప్పుడు పరమాత్మను వశపఱచుకొనఁగలవు. ప్రతిజీవమునందును పరమాత్మస్వరూపము నిలచియున్నది. అన్నియును సమానములే భగవంతుఁడనేక నామములతో బిలువఁబడుచున్నాఁడు కొందరు "కృష్ణా" యనియుఁ గొందరు "ఈశ్వరా." యనియు గొందరు "రామా" యనియుఁ గొందరు 'పాండురంగా, యనియుఁ బిలుచుచున్నారు. ఇవియన్నియు నేకరూప ప్రధానములు. ఏకగుణాకలితంబులు. ఏకజ్ఞానగోచరంబులు. అన్నినామములను సమబుద్ధితోఁ బాటింపవలయు. అణుమాత్రమేనియు భేదము నాపాదింపగూడదు. భగవంతుని

లీలలన్నియు నీనామములయందును జెల్లుచుండును. కలి యుగంబున భగవంతుఁడు 'కృష్ణా' యను నామంబునఁ బూజింపఁబడు చున్నవాఁడు. అట్టి కృష్ణునిలీల వర్ణింపఁ దరమా? ఆతని నుతింప శక్యమా ?

అనుబంధము. ౧౨.

సీ. బాల్యంబుననె చనుబాలు ద్రావించెడు
పూతనఁ బోఁగొన్న పురుషమూర్తి !
మనుదిన్న నెపమునఁ దననోరఁ దల్లికి
విశ్వంబుసూపిన విశ్వమూర్తి!
ఘోరవిషానలదారుణాకారుఁ గా
ళీయుమర్దించిన గేయమూర్తి !
కోపించి వజ్రిపై గోవర్ధనాచలం
బవలీల నెత్తిన యచలమూర్తి!

గీ. ఘోర దానవమర్దన ధీరమూర్తి!
సత్యవాక్పరిపాలన శాంతమూర్తి !
పరమపావనమూర్తి ! యద్వంద్వమూర్తి !
కేవలము విష్ణుమూర్తి ! శ్రీకృష్ణమూర్తి !

కుమారా ! ఇవియన్నియు ముక్తికి మూలసాధనములు. ముక్తి యనఁగా సంసారబాధములనుండి విముక్తియగుట. ముక్తియే జన్మ సాఫల్య మొసఁగునది. అన్నిఁటికంటెను భక్తి నిర్హేతుకమై యుండవలయును. భక్తాగ్రణీ ! రాముని సేవించువిధం బెఱింగించెద రమ్ము.

(అని చేరదీసి చెవియందు తారకమంత్రోపదేశ మొసగ్గును)

నామ——(దీర్ఘనిశ్వాస పురస్సరంబగు వికసిత హృదయముతో) తండ్రీ! ఈ యజ్ఞానుని రక్షించితివి. పరమార్థ మెఱిఁగించితివి. నా కింకేమి కావలయు? ఆహా! గురుబోధా ప్రభావ మెట్టిది?

గీ. ముక్తిమార్గప్రదాయికి మూలధనము
పటులపాపాబ్ధిఁ జల్లార్ప జలధరంబు
రామనామామృతముఁ గూర్చు రమ్యపథము
సద్గురునిబోధ! యీ మూఁడు జగములందు.

స్వామీ! నాజన్మమును దరింపఁజేసితిరి.

(సాష్టాంగపడును)

నిసో——[సప్రేమమున లేవదీసి] కుమారా! ఇఁక నీవరిగి పాండురంగని నిశ్చింతమెయి సేవింపుము. సామాన్యమానవులంబలె భక్తసింహుఁడవగు నీవును లోకహితానువర్తివై గురుబోధ నందితివి. నేనింక యాశ్రమంబున కరిగెద.

(నిష్క్రమించును)

నామ——(ఆనందమున సొక్కుచు) నాతండ్రీ! పాండురంగా!

ఉ. ఈసరికే కృపార్ద్రమతి నెల్ల విధంబులఁ గాచుచుంటివీ
దాసుని దోసములెడపి ధన్యునిఁ జేయవె నీసయుక్తి మనో
న్యాసమె ఘోరపాప పరిహారమటంచును నమ్మి కొల్తు నో
దాసజనావనా! కుటిలదానవభంజన! చిత్తరంజనా!

రంగా! ఖగరాజతురంగా!

## హం స ధ్వ ని

దశరథనందన దైత్యవిరామ
కౌశిక మఖపరిపాలనరామ
గౌతమసతి సంరక్షణరామ
శాలంకు ధనుర్భంజనరామ
సీతార్పిత వనమాలికరామ
ఖరకులనాశన విక్రమరామ
కబంధకంఠ విలుంఠనరామ
రావణమారణ కారణరామ
హనుమద్భక్తి సుపోషితరామ
రఘుకులదీపక రాఘవరామ
మాయామానుష విగ్రహరామ
దాసజనావన ! దశరథరామ.

[భజన సేయుచు నిష్క్రమింతురు]

[తెర వ్రాలును]

ఇది ద్వితీయాంకము.

---

ఓమ్.

# భక్తనామదేవు

## తృతీయాంకము.

### ౧ వ రంగము. కరవీరపురము — నేతాజిసౌధము.

(నామదేవుడు [illegible] యుండెదరయుయు. [illegible] [illegible])

[ప్రవేశము—నామదేవు భజనసేయుచు]

నామ — (భక్తిభావముతో) రామా! సకలసద్గుణధామా!

అనుబంధము ౧౩

మ. తలమే? బ్రహ్మకు నేని నీసుగుణసంతానంబు వర్ణింప ని
ర్మలతత్త్వంబులు శైశవంబునను ప్రారంభించి వర్ణించుచుం
గలుగున్ జెందఁగరాని మోహసుఖసంగాతంబు నిత్యంబునం
జలితుల్ దీని నెఱుంగలేరుకద; యీశా! పాండురంగప్రభూ!

(శ్రమ నభినయించుచు) పండరీపురమింకను జాలదూరమున నున్నది. పోవుదమన్నఁ జాల ప్రొద్దగుచున్నది. వాడిమయూఖములు విచ్చలవిడి నెల్లెడల సంచరించుచున్నవి. పాదములు మొద్దువాఱుచున్నవి. పిపాస మిక్కుటమగుచున్నది. (చూపు నిగుడించి) పరిసరంబుల నెచ్చటను నగరముండునటులఁ గాన్పడకున్నది. అబ్బ! ఏమి యీ చండభానుని తీవ్రశాసనము? సకల చరాచరంబులఁ దన తీవ్రప్రతాపాగ్నికీలలఁబడఁగొట్టుచున్నాఁడు.

(నడచుచు) అల్లదే కానంబడునది క్రీడావనంబై యుండనోపు. అందెచ్చటనేని జలాశయముండునేమో?

[వనము దరియును]

(ఆశ్చర్యముతో) ఓహో! ఏమిది? పురబాహ్యప్రదేశంబున నుండు తరుప్రదేశమువలె నున్నది? కానిమ్ము. పురంబునకరిగి కొంత విశ్రాంతిఁ గైకొనెద.

[నగరమును బ్రవేశించును]

అహో! ఏమి యీనగర నిర్మాణము?

సీ. శిల్పికారుని భావచిత్రితంబులఁ జెంది
మిన్నులతోరాయు మేడలగుమి
కాంచనరత్న సంఘటిత వైభవముతోఁ
దనరారు తద్గృహద్వారచయము
మానవప్రతిబింబమానితంబగునట్టి
విమలరత్న వికార వేదికాలి
మాణిక్యఖచిత సామజము లిర్వంకల
దాపున నునువగు తాపలతతి

గీ. నిలచి యేదెసఁబరికింపఁ గలుముల జవ
రాలి పురమోయనంగ విరాజమాన
విభవసంతానబద్ధమై వెలయు నిప్పు
రంబు రెండవ యలకాపురంబుఁగాదె?

(ముందరికి దృష్టినిగిడించి) ఈసౌధమెవ్వరిదో సుగుణసంపన్నులగువారిదని తోచుచున్నది. ఇచ్చోటికేగి మత్పిపాస నపనయించుకొనెద.

[గృహద్వారముచెంత నిలచి చూచుచుండును]

(లోపలనుండి తార యను దాసి వచ్చుచుండును)

తార—(నామదేవుగాంచి స్వగతము) ఆహా! ఏమి యీతనిమూర్తి! ఎవ్వరో మహాభక్తుఁడైయుండనోపు. (ప్రకాశము) స్వామీ! లోపలికి దయచేయుఁడు.

[నామదేవుని గృహములోనికిఁ దీసికొని పోవును]

నామ—తల్లీ! కొంచెము దాహ మొసంగెదవా?

[తార జలపాత్రమునివ్వ నామదేవు తనపిపాసనణంచుకొనును]

నామ—(సంతసముతో) అమ్మా! ఈపుణ్యగృహం బెవ్వరిది?

తార—(వినయశ్రద్ధలతో) స్వామీ! ఇది నేతాజి యను నొకసుగుణ సంపన్నుని గృహము. వారలిప్పుడు గ్రామాంతరమున కేగి యున్నవారలు. వారి యేకపుత్రియగు రాధాబాయి స్నానార్థమై తోటకరిగియున్నది. మహాత్మా! నేడు మాగృహంబున విందారగింపవలయు.

నామ—అట్టులే యగుఁగాక తల్లీ!

[అని నిద్రనభినయించును]

తార—(అదియెఱింగి యొక శయ్యనమర్చి) స్వామీ! మార్గాయాసంబునఁ గడు బడలియున్నారు. కొంచెముసేపు విశ్రమింపుడు.

(నామదేవుశయనించును. తార వీవనతో విసరుచుండనాతఁడు గాఢముగా నిద్రవోవును)

[ప్రవేశము. పూలబుట్టతో రాధాబాయి]

రాధ—(నామదేవునిఁగాంచి యాశ్చర్యముతో) తారా! ఈమహాత్ము లెవ్వరే!

తార—అమ్మా! ఎవ్వరో యొకరింగా. గృహంబున కరుదెంచుటంజేసి సపర్యలొనర్చుచుంటిని.

రాధ—అదియే కదా వైహికంబున మనము సంపాదించుకొను భాగ్యము. నెచ్చెలీ! పూజాద్రవ్యములన్నియు సిద్ధము జేసిరమ్ము.

[పూలబుట్టతో తారలోని కేగును]

(రాధకు నామదేవు గాంచినకొలందియు నొకవంక భక్తిబీజము నింకొకదెస మోహబీజమును సమముగా నామె స్వాంతంబున మొలకలెత్తుచుండును)

రాధ—(భక్తిభావముతో) ఆహా! ఏమి యీతనిమూర్తి? మొగంబున శాంతరసము తొణికిపోవుచున్నదే? ఏమా నిశ్చలభావము? ఏమా గంభీరహృదయము? ఈతండెవ్వండో పరమభక్తశిఖామణియైయుండవలె నేనెట్టిపుణ్యము సల్పితినో నాకీ మహాత్ముని సందర్శనమబ్బుటకు? ఏమిది? తలంచినకొలది హృదయమేలకో యీతనిపై బరుగులిడుచున్నది?

(చకితభావముతో) ఆ! పరపురుషుం జేరాంతముగ గాంచుట సతులకు పాతకము గాదా? కావున ఈ మహాత్ముండు మాగృహంబున కతిథిగా నేతెంచియుండెంగదా? అతిథిపూజాసక్తులగువారలకు స్వపురుష పరపురుషులను భేదమేమున్నది?

[అతిథిభావముతో] పాప మీతడెంత దూరమునుండి వచ్చుచుండెనో? ఎంతయలసియుండెనో? ఇంకను వదనంబున నలసటచిహ్నంబులు గానంబడుచునే యున్నవి. సుఖనిద్ర పట్టినటుల కొంచెముసేపు విసరెదగాక.

[ప్రణయభావముతో విసరుచు] ఆహా! ఏమి యీతని సుప్రసన్న వదనమండలము? కనురెప్పల చారలు ఘర్మబిందువులు శాంతరసప్రధానములుగ భాసిల్లుచున్నవే? నిర్మలహృదయ

కమల కాసారంబున భక్తిరసామృతమెటుల దరుల నొరసి యున్నదో కదా? అబ్బ! ఈతని యాకృతి వర్ణనాతీతముగదా?

గీ. కనులు శాంతిరసచ్ఛిత్ప్రకాశితములు
గతులు నమ్రత్వభావసంకల్పితములు
ఇట్టి వానికరంబు నేయింతిపట్టు
దాని కబ్బునె? సురజన్మ ధాత్రియందు.

[సప్రేమమున శుశ్రూషానర్చుచుండును]

తార—[తిరిగి ప్రవేశించి] సఖీ! అన్నియు సిద్ధములైనవి.

రాధ—మహాత్ములియ్యెడ నిద్రమేల్కొనునట్లు లగపడదు. పూజావిధానము ముగిసిన యనంతరము మేల్కొలుపవచ్చును. పోదముపద.

[ఇద్దరును బోదురు]

[రంగస్థలంబున నామదేవు శయనించియుండును]

[తెరలో]

[గంటానాదములును విష్ణుసంకీర్తనములును వినఁబడుచుండును]

నామ—[త్రుళ్ళిపడి లేచి వినుటనభినయించి] ఎక్కడిదీ విష్ణుసంకీర్తనము? హాయి! హాయి! కర్ణానందమొనగూర్చుచున్నది. అబ్బ! విష్ణుసంకీర్తనామృతమును గ్రోలి యెంతతడవైనది. ఆహా! ఏమా కోమలకంఠ నినాదమాధురీలహరి? ఏమా భక్తిరస ప్రపూరితవిష్ణుసంకీర్తనామృత ఝరీవేగము? ఏమా చిదానంద రూప ప్రకాశిత స్వానందసుధాతరంగము? జయపాండురంగ ప్రభూ! జయసచ్చిదానందప్రభూ!

## తరలము.

నిలుపులేని మనస్కులే క్రియ నిన్నుఁ గూర్చి భవద్గుణం
బులఁ దిక్కాలములన్నుతించినఁ బొందఁజాలరు ముక్తి నీ
తలఁపులేని శరీరికే ధన ధాన్యరాసులు గల్గినన్
ఫలముశూన్యము విశ్వభావన! పాండురంగ! దయానిధీ!

[తెఱలోనుండి వినవచ్చిన కీర్తనమ్ము ననుసరించి నిమీలిత నేత్రుఁడై భజనసేయుచుండును]

రాధ — [పూజావిధానంబును ముగించుకొని ప్రవేశించి నామదేవు భక్తిభావమునుగాంచి విస్మయంబున స్వగతము] ఆహా! ఏమి యీమహాత్ముని భక్తి తాత్పర్యము. ఇట్టివానిసేవ లేకాంతకు లభించునో కదా? [ప్రకాశము] స్వామీ! వేళ యతిక్రమించు చున్నది.

నామ — (కనులువిచ్చి యాశ్చర్యచకితుఁడై లేచి) ఈమెయే కాఁబోలు నేతాజీసుతయగు రాధాబాయి. ఆహా! ఏమాకోమలవదన సుశీల సుగుణస్వభావ గాంభీర్యము? ఏమాభక్తిభావ సంజాత హృదయోన్మషణ నిర్మలభావ ప్రకటితము? ఏమా వినయ విధేయ మధురాధర పల్లవచలితస్వభావనైపుణ్యము? ఏమా రమణీయతరుణముఖకమల లావణ్యసౌకుమార్యము? ఏమా రూపరేఖావిలాసము?

సీ. పుండరీకముఁ గోరుఁ బుండరీకము జేరు
గమనంబుకన్నులు కిరణవింపు
హారికలాపము గెల్చు హారికలాపముబిల్చు
మధ్యంబుపల్కులు మార్దవంబు
అబ్జంబు హాసియించు నబ్జంబుమఱపించు
గ్రీవంబు వదనంబు గేరుకాంతి
మధుపాలిబురడించు మధుపాలితముఁ జెందు
కురుపాలిరూపంబు గోరుప్రేమ

గీ. బాల! సుమబాల! మృదులకపోల! శీల!
హరిపదాంభోజ యుగ్మక ధ్యానలోల!
అతిథిపూజానిబద్ధ గుణాలవాల!
మఱపువచ్చెనె? వేయిజన్మాలకేని.

[ప్రకాశము] బాలికామణీ! నీభక్తివిశేషంబులు మెచ్చదగినవి.

రాధ—స్వామీ! నమస్కారము. [నమస్కరించును]

నామ—[సుప్రసన్నవదనముతో] కల్యాణివగుదువుగాక.

రాధ—[అధోముఖియై] మహాత్మా! తమ పవిత్రనామ మెఱుంగ వచ్చునా?

నామ—కోమలీ! నామదేవని జనులు నన్నుఁ బిలుచుచుందురు.

రాధ—(విస్మయ సంభ్రమములతో] మహానుభావా! ధన్యనైతి. తమ దర్శనభాగ్యంబు లభించుటఁజేసి నానోములు సఫలీకృతము లైనవి. పాండురంగనికి నాపైఁ గృపవాడమినది.

నామ—బాలామణీ! నీచరితం బస్మదృశులకు హితంబుఁ గలిగించెదు గాదే?

రాధ—అంతయు మీకృపయేగదా? స్వామీ! వేళ యతిక్రమించు చున్నది. మాయాతిథ్యంబును స్వీకరించి మాగృహంబును బావనమొనర్పుడు. నెచ్చెలీ! తారా! మహాత్ముల స్నానార్థము గొనిపొమ్ము.

(అంత తార నామదేవు లోనికిఁ గొంపోవును)

రాధ—[స్వగతము] ఇట్టిపరమభక్తుని పత్నియగుటకు నేకన్యకామణి నోచియున్నదోకదా? చిత్తహరా! తత్తరమందకము. పాండు రంగా! ఈ సద్గుణసంభూతునకే నన్నుఁ బత్నిఁగా నొనర్పుము.

[నిష్క్రమించును]

(తెరవ్రాలును)

---

## ౨ వ రంగము. సౌధము.

(రాధాబాయి యిచ్చట వేషముమార్చవలయును. విరియబోసినతలకట్టును మలినవస్త్రధారణమును నాభరణవిహీనంబును గలిగియుండవలయును. భావప్రకటనమునఁ జింతాకులస్వాంతగను విరక్తిభావోద్రేకగను దుస్సహవేదనాపరురాలుగను మూర్తీభవించిన శోకదేవతవలెను గాన్పింగవలయును. నేత్రము లేబదియేండ్లకు మించినవానివలె గుంటవలయును. కానిధనికుని లక్షణములు గన్పడవలయును. వేషము దామాజీకివలె నుండవలయును. భావమునఁ బుత్రికా ప్రేమముగలవానిగను దీర్ఘకోపములేనివానిగను గాన్పింగవలెను.)

[ప్రవేశము : ఖిన్నవదనముతో రాధాబాయి]

రాధ—(నిట్టూర్పుతో) కటకటా! జనకుఁడెంత చెప్పినను వినఁడయ్యో. నేనేమి సేయుదాన? ఎవ్వరితో మొరవెట్టుకొందు? నాకుదిక్కెవ్వరు? హా! పాండురంగా! నాకీప్రేమ నేల నంకురింపఁ జేసితివి? చేసితివిపో? ఈవ్యసనభావ మేలఁ గలిగించెదవు? హా! హా!

(కొంతతడవు చింతానిమగ్నయగును)

(స్మృతినభినయించి) ఆహా! ఆభక్తశిఖామణిమాటఁ దలంచినకొలఁది శరీరము తన్మయత్వము నొందుచున్నది. అబ్బా! నాటిమాట జ్ఞప్తికివచ్చినచో మితిలేని సంతసము గలుగుచున్నది. అయ్యో! ఇంకెక్కడి సంతసము? ఆమహాత్ముని కీర్తనలనే భక్తిభావముల నెఱుంగుచు విష్ణుకీర్తనసుధారసపానపరవశచిత్తనగు భాగ్యము నాయెడఁ గలుగునా? ఆతనిపాదసేవలు నాకబ్బునా? హా! తండ్రీ! ఏకపుత్రికనగు నన్నిట్టులఁ గష్టపెట్టుట భావ్యమా? అయ్యో! జనకుని దూఱుచుంటి నేల? నాపూర్వబహుళజననసుకృతఫలరూపమిదియే కాబోలు. నాఁడు ఆమహాత్ముని సందర్శనమబ్బిననాఁడు— ఆభక్తవతంసుని కరుణారసకలిత ప్రధానంబులగు పల్కులవిను భాగ్య మొదవిననాఁడు— నానోములన్నియు సఫలీకృతములగునని తలంచియుంటినే. కట్టా! నేటికా తలఁపులన్నియు నడుగంటెఁగదా? నేటికి నాయాశాలత వాడిపోయెఁగదా? నేటికి నాయెడ దుర్వ్యసన ఘాతంబు చిందులు ద్రొక్కుచుండెఁగదా? అయ్యో!

కన్నులు తిరిగిపోవుచున్నవి. ఏమది? మహాత్మా! వచ్చితివా? రమ్మా. నీపాదకమలముల నొక్కసారి భజింపనిమ్మా. ఈదీనురాలిపై నీకుంగల ప్రేమ కన్నతండ్రికి లేకపోయెంగదా! ఇది యేమి? పాండురంగా! భయములేదని తెల్పుచుంటివా? ఊరట నొందుమని పల్కుచుంటివా? ఇంకెక్కడియూరట. హా! హా!

(మూర్ఛిల్లును)

[ప్రవేశము—నేతాజి]

నేతా—(స్వగతము) మదీయపుత్రిక మొండితనము వహించుచున్నది. ఎంతచెప్పినను వినదుగదా? ఎవ్వనినో యొక భాగ్యవంతుని బిడ్డను గోరి సంతసపడుదునని తలంచితిని గాని యిట్టుల నొకదరిద్రుని గోరునని కలనైనం దలంపనైతినే! మొదలు చనువిచ్చుటయే తప్పు. కష్టసుఖమ్ము లాలోచించుటకు దానికేమి తెలియును? జననిలేదుగదా యని గారాబముతోం బెంచినందులకు వృద్ధాప్యమున నాకీ మనస్సంకటమును గూర్చుచున్నది. ఇంకను గొంతబుద్ధిచెప్పిచూచెద. ఎల్లప్పుడా నామపునం గూర్చి యొకటే చింత. అబ్బ! లేక లేకొక్కబాలిక జనించినందులకు నిడుముల నెన్నిటేంగుడుచుచుంటిని. ఇంతకును దైవాధీనమెట్టులున్నదో! (ముందునకుంజూచి) అయ్యో! ఇది యేమి! కుమారిక మూర్ఛపడియున్నదే?

[తత్తరముతోం బోయి తనయంకతలంబున నామె శిరంబునునిచి]

తారా! శీతలోదకంబులం గొనితెమ్మా.

తార—(ఆత్రముతో నీరుదెచ్చి నెచ్చెలిమోముపైం జల్లును)

రాధ—(మెల్లమెల్లగ కనులువిచ్చి) తండ్రీ! కనికరము లేదా?

నేతా—ఒకప్పుడుమాత్రము నీపై నాకుం గోపమున్నదా తల్లీ! భాగ్యవంతునిం జేపట్టుమని కోరితిని గాని నిన్నేమని కసిరికొట్టితినా? అమ్మా నీపిచ్చితలంపు మాని భాగ్యశాలి నొక్కనిం గోరి నాచింత దీర్పుము.

రాధ — జనకా! ఇంకొకనిపై నామనంబు పోనేరదు.

(అని లేచి నిలఁబడును)

నేతా — అట్టులఁ దలంపకుము తల్లీ! ఆతనికంటె రూపవంతులు లేరా? భాగ్యసంపన్నులు లేరా?

రాధ — భోగభాగ్యము లెందుకు తండ్రీ! గుణము ప్రధానంబు కాని రూపము ప్రధానముగాదుగదా?

నేతా — నీకింకను లోకజ్ఞానము చాలదు. ఇక్కాలంబున నర్థహీనుల బ్రతుకు వ్యర్థమని యెఱుంగుము. అట్టి వ్యర్థులకు నిన్నెట్టు లివ్వఁగలను?

రాధ — తండ్రీ! మున్ను సావిత్రీదేవి సత్యవంతుని భాగ్యశాలియని ప్రేమించినదా? అనుకూల దాంపత్యము నిలుచుచోట భోగ భాగ్యంబులు తృణప్రాయములని యెఱుంగవా?

నేతా — కాలక్రమము ననుసరించి మార్పులనేకములు జరుగుచున్నవి.

రాధ — అగుఁగాక. ధీరసతుల గుణంబులయందేమార్పులును గలుగఁజాలవు. భాగ్యము భాగ్యమని పలుమారులు పల్కెదవేల? భాగ్యము శాశ్వతమా? భోగము శాశ్వతమా? భాగ్యశాలి దరిద్రుఁడు గావచ్చును దరిద్రుఁడు ధనాకరుఁడుగావచ్చును. తండ్రీ! ఇప్పుడు నీవు ధనవంతునకే నన్నిచ్చినచోఁ గొంతకా కాలంబున కాతఁడు దుర్వ్యసనాయంబులన దరిద్రుఁడయిన నప్పుడింకొక సంపదాఢ్యునిఁ గోరుమనియెదవా?

నేతా — అమ్మా! నేనంత జడమతినిగాను.

రాధ — కాకేమి? ఇదివరకు మహానందోత్కృష్టుని వరియించి మిత్రా నాథునిఁగా భావించియుండి ఇప్పుడిట్టివానిని నీకై దూరము నాలిని జేయుచున్నావు జడమతివిగావా?

నేతా—(చిరాకుతో) వరియించినంతనే యాతండు నాథుండయ్యెగా! గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించెనను చందంబున నాకే నీతులు గరపుచుంటివా!

రాధ—(శాంతభావముతో) తండ్రీ! నీపలుకులు కులసతీమతవిరుద్ధములు.

గీ. శీలవతియైన సతి తన చిత్తమెవని
యందు మొదట లగ్నమగునో? యట్టివానిఁ
దనకుఁ బ్రాణేశ్వరునిఁగఁ గైకొనునుగాని
పరునిఁ గన్నెత్తియేనియు సరయఁగలదె?

నేతా—(తీవ్రచిత్తముతో) నీయాగడమింక సాగనేరదు.

రాధ—[కడువిచారముతో] జనకా! కోరినభర్తను జేకూర్చుమనుట యాగడమా? హా! ఎంతటి కఠినభావమూనితివి! నాతల్లి గతించుటజేసియేకదా నాకిట్టి దుఃఖంబుగల్గె. నాతల్లి యుండియున్నచో నింత కఠోరముగాఁ బల్కుదువా? అయ్యో! నిన్ను ధనధాన్యంబు లొసంగుమని కోరితినా? నా కైశ్వర్యముల పాలు నిమ్మంటినా? తండ్రీ! నా యీ చిన్నివాంఛితంబును దీర్పఁజాలవా? పుత్రికలపైఁ దండ్రులు చూపు భావమిదియేనా? కటకటా! నాకు దిక్కెవ్వరు?

సీ. జనని గతియించె పోషింప జనులు లేరు
జనకుఁడొక్కఁడె మత్ప్రాణచిహ్నమనుచుఁ
దలఁచియుంటిని నేటికా తలఁపు వఱలఁగ
దిక్కెవరొక్కొ? నాబోటిబిడ్డలకును.

(దుఃఖించుచు) తాతా! నీవైనను [illegible] గనుగొనఁగలవా? అయ్యయ్యో! ఏమి నా పిచ్చి? కన్నతండ్రియే కఠినవర్తియయిన నితరులేమి చేయఁగలరు? హా! హా! ఎక్కడికిఁ బోవుదాన? ఎవరున్నారు? దైవమా! నీవలన నాకింతటి [illegible]

చిత్తమా! నీకును నాకును ఋణముదీఱినది. శోకమా! నాకింకనీవనే శరణు. రమ్ము. నన్ను నీయందుఁ జేర్చుకొనుము.

[అని విలపించును]

సేతా — (సప్రేమముగాఁ బుత్రికను జేరఁదీసి కనుల నీటి నద్దుచు) తల్లీ! శోకింపకుము. నేనెంత యారాటపడినను నీమేలుకొఱకే గదా?

రాధ — (దిట్టతనముగా) తండ్రీ! నీవు నామేలుఁదలంచినచో నామనోహారునకే నన్నప్పగించుము.

సేతా — (విచారముగా) మీకుమిక్కిలి కోపించినచో బిడ్డ శోకించును పుత్రికాశోకంబును గాంచినంతనే నామనంబు నీరగును. ఆతని కొసంగుదమన్న మానస మొప్పదు. అబ్బా! సంసారసాగరము నీదుట దుర్లభంబుగదా!

ఉ. అరసి తారకాగణముసంతయు నెంచగవచ్చుఁగానలోఁ
దూఱఁగవచ్చుఁ గాలువగ దోయధినీదఁగవచ్చు శత్రుసం
హారమొనర్పవచ్చు బడబాగ్నికణంబుల మ్రింగవచ్చు సం
సార సముద్రమీఁదుటకుఁ జాలరుచాలరు జీవులెవ్విధిన్.

కానిమ్ము. భవిష్యదర్థంబు నెఱుఁగు సమర్థులెవ్వరు? పుత్రులైనను బుత్రికలైనను నీమె యొక్కతెయేకదా! నాధనమునే యీమెకప్పగించి సుఖజీవనోపాధి నెందులకుఁ గూర్పఁగూడదు! అనురాగము లేని దాంపత్యముఁ జేకూర్చి కలకాలము బిడ్డ దుఃఖించుచుండ నేఁజూడఁగలనా? నాకుమాత్ర మింక దిక్కేమున్నది? పాపము! తల్లి గతించినను లేశమాత్రమేనియు దుఃఖింపక నగుమొగంబున నాకానందమును గూర్చిన నాతల్లి నేను సవతల్లి దలంచి యెంతదుఃఖించె? నామానసమింకను వేదనముఁ జెందియేయున్నది. చిత్తమా! మొట్టమొదట నెంతకాఠిన్యమూనితివి? తుదకెంతటి మార్దవంబును జెందితివి! నాబిడ్డ హృదయమెంతటితీవ్ర వేదనల పాలగుచున్నదో కదా? [ప్రకాశముగ] బిడ్డా! శోకింపకుము. నీవాంఛితమును దీర్చెదలెమ్ము.

రాధ—(సంతసముతోఁ దండ్రిఁ గౌగలించుకొని) తండ్రీ! నాజన్మ మిప్పటికిఁగదా తరించినది. సుతలకు శ్రేయముఁ గోర్చి వారల కష్టసుఖమ్ముల విచారించువారలే కదా నిక్కమగు దల్లిదండ్రులు. అట్లుగాక పొట్టకూటికై కన్నులుగానవని తమతమ ముద్దుబిడ్డల ధనము నకాంక్షించి యీడుజోడులేని యే వృద్ధులకో యే దుర్వ్యధగాములకో, యంటగట్టి దుఃఖములపాలు సేయు వారలందరుఁ బ్రేమగల తల్లిదండ్రులు లేనా? సంతలయందుఁ బశువుల విక్రయించునట్లుఁ బుట్టిననాటనుండియుఁ బెంచిన ప్రేమ భావము నేనియుఁ జూపక పుత్రికల పోషణార్థమై యుగ్గుపాల నుండి పెండ్లియగువరకు వెచ్చించిన ధనమును జక్కగ వడ్డీ వేసియు విడువక కన్యాశుల్కము మూలమున గడించుచుఁ బుట్టినింటి కొకనామమేసియుఁ దీసికొనివచ్చినచోఁ దద్ధనముఁ దిరిగి పొందు మార్గములు లేవని యొక్క కాలను దీసియు వారల మొగంబులఁ జూడక భాగ్యలక్ష్మియుఁ దీరెఁగదా యని పొంగువారలు పుత్రికలపాలిఁటి ప్రబలశత్రులు గాక మిత్రులగుదురా? జనకా! నీయట్టి ప్రేమమూర్తి నాయందమరించెను నా వాంఛితమీడేరు మార్గములు గలుగును. (ధ్యానముతో) హే పరాత్పరా! కృపాళూ! దయాసింధూ!

ఉ. వ్రతములఁ జల్పితి బన్నముల్ గడచుచుండె ఘనార్తి నదిర్చితిన్
గతిగన్గొంటిని మోక్షమార్గమునకున్ గారాదు మిట్టుంబడెన్
జతగాఁ గూర్చితి మన్మనోహరునితో సన్మూర్తి సింహంబుతో
సతిగాత్రంబున నిన్నుఁ దెంచెదను శ్రీనాథా! దయాంభోనిధీ!

నేత—తల్లీ! శుభవర్తమానముఁ బుట్టకై వలయు సన్నాహంబుల సిద్ధమొనర్తము రమ్ము.

(రాధ మనసిగ్గుతోఁ దలవంచుకొని తండ్రితో నిష్క్రమించును)

(తెర వ్రాలును)

## 3 -వ రంగము — పండరీపురము — దామాజీగృహము

(దామాజీ వేషము పూర్వపలయును. తొల్లిటివలెం జొక్కా పచ్చడము టోపీ మొదలగునవి యేమియు లేక ఒక చిన్న తుండుగుడ్డ నొకదానిని వేసికొని మెడయందున్ను తులసీ మాలలుంచుకొని పిల్లజుట్టుగల తలకట్టులో నింటి యందవాళియందొక ద్వారముమీదగూర్చుండి భార్యతో సంభాషించుచున్నట్లుగా నుండవలయును. గుణాబాయి వేషము పూర్వప్రకారముగనే యుండవలయును.)

[ప్రవేశము — దామాజి గుణాబాయి]

గుణా — నాథా! కుఱ్ఱవానికి యుక్తవయస్సు వచ్చినది. పెండ్లిసంగతి నింకను దలపెట్టకున్నారు. ఎల్లకాలము మన ఘటములు శాశ్వతములా? ఏదో కుఱ్ఱవానిం గని పెంచినందులకింత ముద్దుముచ్చటలఁ జేసియుం దీర్చుకొనవలదా? వాఁడేనియు గురువులని కొంతకాలము భక్తిమార్గములని కొంతకాలము వృథఁ జేయుచు సంసారసంబంధము లేకయే తిరుగుచున్నాఁడు. ఏదియో యొక మార్గము నవలంబింపక కలకాలము భక్తి భక్తియని కొట్టుకలాడుటవలనఁ బ్రయోజన మేమున్నది? మీకును వృద్ధాప్యము దాపరించినది. లేవలేనినాఁడు గొంతులో గుక్కెడుగంజిఁ గాచిపోయుటకు మన కాధార మెక్కడఁ గన్పట్టదు. పురుషకారము లేనియెడలఁ దమకు తామే కార్యములు సిద్ధింపఁగలవా? అడవులఁ బలుదడవులం బట్టి క్రుమ్మరుచు నిన్ననే సుతుఁడు గృహంబునకుఁ జేరె. చేరుటయే తడవుగాఁ బాండురంగాలయంబునకరిగె. మాటలాడుటకు సమయము తీరిక లేనంతటి యవస్థలోఁబడి వాఁడు కొట్టుకొనుచున్నాఁడు. ఎల్లప్పుడిట్టులేయగుచో ముందుగతి యేమి?

దామా — కాంతా! ఆరాటపడుటవలన లాభమేమున్నది. వివాహమనునది యొక సాధారణకృత్యమా? మనకుఁ గావలసిన దగ్గర సంబంధములు లేనిమాట నీవెఱింగియే యుంటివి ఇక దూరసంబంధమునకై పోవుదమన్న మనము కడుదరిద్రులము. అదిగాక మనకుఱ్ఱవానిఁ జూతమన్న వానిభక్తియేమో వాని పూజలేమో యవియేకాని యీకాలపుయువకులవలె నీటుగా

వేషములవేసి తిరుగువాఁడుకాఁడు. భక్తుఁడన్న వాని నిక్కా-లమున జనులు పిచ్చివానిఁగా జూతురు. పదంపడి స్త్రీసంఘమునం దెచ్చటఁజూచినను దురాచారములు మిక్కుటముగాఁ బ్రబలుచున్నవి. భిన్నవేషములు భిన్నబుద్ధులు చెలరేఁగుచున్నవి. కొందరు స్త్రీలు భర్తలుండుటవలనఁ దమ స్వాతంత్ర్యములు కూలిపోవుచున్నవనియు భర్తలనువార లుంటయే కూడదనియు నెంచుచున్నారు. ఒకకట్టునందేమి బొట్టునందేమి జుట్టునందేమి క్షణక్షణమున ననేకమార్పులు జరుగుచున్నవి ఇట్టివారలకెట్టి సద్గుణములుండునో తెలియరాదు. అదిగాక కొందరు పతులకు సతులే యన్నిటియందును మూలాధారులగుటఁజేసి పతులే సతులమాట వినవలయునని యూఁ దలంచుచున్నారు. సతీ! కాలపుచర్యలీవిధముగా మారుచున్నవి. ఇట్టియెడ మనము సత్కులజాతయగు బిల్లను వెదకవలసియున్నది. అట్టివారలు వెలలేని రత్నంబులవలెఁ బ్రకాశించుచుందురు. మనపుత్రునకుఁ దగిన భామామణినిఁగాంచుట సామాన్యమా? అన్యుల నంటఁగట్టినచోఁ బిల్లవానిని బాడుచేసినవారమగుదుము, అన్నిటకిని విత్తము ప్రధానముగదా! కానిమ్ము. పిల్లవాఁడు వచ్చినయనంతరము వానియిష్టమేమో కన్గొని తదనుకూలప్రకార మాచరించుట శ్రేయోదాయకము పెక్కుచోటుల దిరుగువాఁడు గనుక వానికిని లోకములోని వింతలన్నియు నెఱుకపడియుండవచ్చును. ఏబాలికయందేని యాతని మనంబు లగ్నమైయున్నదేమో?

గుణా—అయ్యో! అంతమా పుభాగ్యమా.

[ప్రవేశము—నామదేవు]

అనుబంధము ౧౫.

నామ.—[బద్ధాంజలియై] హే పాండురంగా!

శ్లో. పరిస్లోదార్తివిభంజనం! గుణనిధిం! బ్రహ్మాదిసంసేవితం
మాయామానుషవిగ్రహం! శుభకరం! సంసారబంధాపహం!
సౌందర్యోజ్జ్వలకిన్నరీనుత యశశ్బృందాగ్రవృత్తాశాంతతిం!
భావాతీతమనంతశాయినమహం! శ్రీపాండురంగంభజే!

(శాంతపడి ధ్యానలోలుఁడగును)

[ముందునకుఁ బరికించి స్వగతము] తల్లిదండ్రులేలాకో మోజనానిమగ్నులై యున్నవారలు [ప్రకాశము] జనని జనకులారా! నమస్కారము.

[పరిణమిల్లును]

తల్లి-దండ్రి—[సప్రేమమున లేవనెత్తి తమప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొనెదరు]

దామ—కుమారా! ఎచ్చోటికరిగియుంటివి?

నామ—తండ్రీ! పాండురంగాలయముకన్న నేఁబోవుస్థలమింకొక్కటి కలదా?

గుణా—ఎల్లప్పుడు నిర్విచారముగ సంచరించుటయేనా?

నామ—విచారమేల తల్లీ! నాపాండురంగని చరణ సరోరుహసేవలు లభియించునంతకాలము నిర్విచారముననేకాదు నిత్యానందన ముతోఁ దిరుగాడుచుందును.

దామ—కుమారా! నాపల్కుల నొకించుక వినుము మనుజునకు బ్రహ్మచర్యాశ్రమము— గృహస్థాశ్రమము —వానప్రస్థాశ్ర

మము — సన్న్యాసాశ్రమము లనునవి నాలుగు విశ్రమస్థానములు గలవు. అందుత్తమమైనది గృహస్థాశ్రమము. అజ్ఞానివలననే పురుషుఁడు కర్మలంపటుఁడగుచున్నాఁడు. దానియందే సకల ధర్మము లాచరించుటకు మార్గములు చూపఁబడియున్నవి. పురుషునకదియే సర్వార్థముల నొసంగునది. నీవిప్పుడు బ్రహ్మచర్యమును దాటియున్నవాఁడవు. గృహస్థము నవలంబించు కాలము నీకబ్బినది. దానఁజేసి వివాహమును జేసికొనవలయునుగదా? నిర్వివాహకుఁడు గృహస్థుఁడని పిలువఁబడఁడు గదా?

నామ — దీనికై యింతగాఁ జెప్పనేల జనకా? మీమాటనెప్పుడు తృణీకరించి యుంటినా? మీయిచ్ఛానుసారమే వర్తింపఁగలవాఁడను.

దామ — ఇందు మాయిచ్ఛకేమి రాదు. కష్టసుఖమ్ముల భరించువాఁడవు నీవుగాని మేముకాదుగదా? అనుకూల దాంపత్యము గల్గుట సర్వజన సమ్మోదకము. నీమనం బిదివర కెవ్వరియం దేని లగ్నమైయున్నచోఁ జెప్పుము. అట్టిబాలికామణినే విచారించికొందము.

నామ — నాకేమి తెలియఁగలదు తండ్రీ!

[కొంచెము సిగ్గు నటించును]

గుణా — నాథా! కుఱ్ఱవాఁడేమో సిగ్గుపడుచున్నట్లున్నది.

దామ — కుమారా! ఇందు సిగ్గునొందవలసిన యగత్యమేమున్నది? ఇయ్యది లోకసహజంబే కదా?

గుణా — (పుత్రునిఁ జేరదీసి) బిడ్డా! భయమెందులకు? మాయెదుట నీకుఁ గ్రొత్తరికమేమున్నది? ఇదంతయు నీమేలునకేకదా!

నామ — తల్లీ! నామనంబేలొకో కరవీరపురవాసియగు నేతాజీపుత్రిఁ గనుగాంచిన నాటనుండి చంచలతనొందియున్నది.

గుణా — స్వయముగాఁ గరవీరపురమరిగియుంటివా?

నామ — అవును.

దామ — (సంతసముతో) కాంతా! చూచితివా! పుత్రుఁడు తగినసంబంధమునే యాలోచించుకొనియున్నవాఁడు. సద్గుణసంపన్నుఁడగు నేతాజీ వియ్యములభించినచో ధన్యులమే? కాని యది పొసంగుటెట్లు? ఆతఁడు మిక్కిలి ధనసంపన్నుఁడు. మనమో కడుదరిద్రులము. స్థితిగతుల నాలోచించి యాతఁడేమనునో? కానిమ్ము. తగినయత్నమొనర్చిచూతము. మీఁద దైవాధీనమెట్లగునో?

(ప్రవేశము — నేతాజీకడనుండి వచ్చెడు కొందరు విప్రులు)

విప్రు — మహాత్మా! నేతాజీగారు మీకీశుభలేఖ నంపియున్నారు.

దామ — (ఆశ్చర్యముతో) ఏమి? నేతాజీగారు శుభలేఖనంపియుండిరా? (ఆత్రముతో లేఖనందుకొనును)

నామ — (సిగ్గుతో వెడలిపోఁబోవును)

విప్రు — (అడ్డమువచ్చి) కుమారా! ఎక్కడికిఁబోయెదవు? ఇదంతయు నీకొఱకేకదా!

దామ — (పట్టరానియానందముతో) సతీ! చూచితివా?

కలితకరుణాంతరంగ యోగిఖగతురంగ!
ప్రళయకాలాహిభంగ! శ్రీపాండురంగ!
(మైమఱచియుండును)

దామ—మహాత్ములారా! భగవచ్చిత్రము వర్ణనీయముగదా?

విప్రు—ఇందుఁ జిత్రమేమికలదు మహాత్మా! భవదీయ పుత్రుండు సామాన్యుఁడా?

దామ—కాంతా! మన వాంఛితములిప్పటికీడేరినవి. మహీసురులకు విందులొనర్ప వలయుసన్నాహముల నిర్వర్తింపుము.
(గుణాబాయి నిష్క్రమించును)

విప్రు—(నామదేవునిఁ జేరఁదీసి) కుమారా! నీ యిష్టము నెఱింగింపవైతివే?

నామ—పెద్దల చిత్తంబులకెల్లప్పుడు ననుకూలవర్తినని యే భావింపుడు.

విప్రు—[సంతసముతో] నాయనా! చిరంజీవివై వర్ధిల్లుము.

దామ—అప్పయ్యయుఁ దరువరి మాటలాడుకొనవచ్చును. భోజనకాల మతిక్రమించును. రండు పోవుదము.
[అందరు నిష్క్రమింతురు]

[అవనిక జారును]

ఇది తృతీయాంకము.

———

ఓమ్.

# భ క్త నా మ దే వు

## ప తు ర్థా ం క ము.

### ౧ వ రంగము—నామదేవు గృహము.

(నామదేవు యున్నటు వేషమును మార్చివ్రాయును. [illegible] నిపించు [illegible] పైన నొక యుత్తరమును గన్పించి [illegible] నామదేవు గృహము [illegible] దక్కని [illegible] నుముసు గట్టుకొని [illegible] నామదేవు గృహ [illegible] నప్పితరలు)

(తెర నెత్తగా రాధాబాయి యేదియో వ్రాసికొనుచుఁ గొట్టి వేయుచు మిక్కిలి గజిబిజిలోనుండును)

[ప్రవేశము—వెనుకసాటున నామదేవు]

నామ—(రాధయవస్థఁగాంచి స్వగతము) కాంత యేమియో వ్రాయుచున్నది వెనుకసాటుననుండి యేమివ్రాయునో తిలకించెద.

[వెనుకప్రక్క నిశ్శబ్దముగా నిలచియుండును]

రాధా—(విసుగుతో) అబ్బ! ఎంతయత్నించినను దక్కిన రెండుపాదములఁగూర్పఁ జాలనైతినే. ఎట్లైన నేసియుఁ బూర్తిచేసి నాథునకొసంగవలె.

(ఆలోచనానిమగ్నయగును)

నామ—(కొంచెము దాపునకువచ్చి యామె చేతియందలి కాగితమునుగాంచి] ఈమెపతిభక్తిసిఁగూర్చి వర్ణనముసల్పుచున్నది. ఆహా! కులసతీమణుల గుణాలకుణములనన్నియు యికదా? శ్రీక

గలుగు కాలమందుఁ బరులగృహంబులకేగియో - మైమఱచి నిద్రపోయియో - చెలులతోఁ జేరి మాటలధోరణి తనభర్తనడవడినిఁగూర్చి కొండెములఁబల్కియో - సంసారమునందలికలిమి లేముల గురించి పెక్కువిధముల నుగ్గడించియో - యక్కాలమును వృధఁజేయక సత్పథమునుఁగడపు కామినులేకదా సతీత్వమునకాస్పదులు. కానిమ్ము పాపము! కాంత తక్కిన రెండుపాదములనుఁగూర్పఁజాలక మిక్కిలిశ్రమనొందుచున్నది కష్టకాలములందు నాథునిఁ దలంచికొనుట ధీరవనితలకు సహజగుణము. ఇప్పుడీమె ప్రవర్తన మెట్లు లుండునో చూడవలె.

రాధ—అబ్బ! ఎంతయత్నించినను ఫలము కన్పడుటలేదు! ఏమి చేయుదాన? నాథుఁడేనియుఁ జెంతలేడుకదా ?

నామ—(హాస్యముతో) చెంతనేకలఁడు

రాధ—(తిరిగిచూచి చిరునగవుతో) ఏమి యీవొంగ వేసము ?

నామ—(సప్రేమమున రాధనుజేరదీసి) కాంతా! నీవదనమేమో చింతాకలితమైనటులఁ గన్పడుచున్నదే!

రాధ—ఏమియునులేదునాథా!

నామ—(చిరునగవుతో) నీవుదాచినను నేనంతయుఁజూచియేయుంటిని. నీవ్రాసినపద్యమునుజూడనిమ్ము.

రాధ—(మునుసిగ్గుతో) నాకుదెలియకుండ వెనుకపాటున నిలచి మీరొనర్చు కార్యమిదియా? నాథా! దీనఁగలతప్పులను సవరించిపెట్టుడు.

[కాగితమునొసంగును]

నామ—[తిలకించి] ప్రియా! సగభాగమునందే యాపితివేల?

రాధ—నా భాగము నేను బూర్తి జేసితిని. మీ భాగమును మీరు పూర్తిచేయుడు.

నామ—ఏమి వాక్చాతుర్యము నేర్చితివి.
[అని తక్కిన సగమును బూర్తి చేయును)

కాంతా! ఇప్పుడు దీనిని బఠింపుము.
[కౌఁగిలించుకొనును]

రాధ—[అద్దానిని గైకొని]

ఉ. కాంతుఁడు సేయుకృత్యములఁ గాదనకెందును వాదుసేదమై
సంతసమందుచుం విబుధసంతతి మెచ్చఁ జరించువారలే
కాంతలు; కాంతుకృత్యములఁ గాదని యేగెడువారు కాంతలే
కాంతులపాలి యంతకులుగాక తలంపఁగ ధారుణీస్థలిన్.
[అని చదువును)

నామ—కాంతా! నేను భక్తశిఖామణియగు బ్రహ్లాదుని చరిత్రమును జదివెదనా?

రాధ— (వినయభయములతో) మనోహరా! ఎల్లప్పుడు మనము పురాణకాలక్షేపమున మునింగియుండిన సంసారమును గడపువారలెవ్వరు? తల్లిదండ్రులన్న మూఁడుకాళ్ళముదుసలు. వారలకు మనము సలుపవలసిన కాలముగాని మనకు వారలు సలుపవలసిన కాలముగాదు. ఇంతవరకుఁ దండ్రిగారిట్టులనో సంసారమును గడపుచుండిరి. మనము వారలకుఁ దోడుపడక సతతము శ్రీమన్నా[illegible]సరసీరుహాయుగళస్మరణసుధా రసపానపరవశులమగుచో నిక్కడ కష్టమును వారలకేఁ గూర్చినవారమగుదుము. దీనివలన మనభక్తిమార్గమునకెట్టి సంకటములును గలుగఁ జాలవు. పనిలేని సమయమందు కథాకాల

క్షేపమున మెలంగవచ్చు. మనకుఁ బ్రస్తుతము వ్యాపారము
కులవృత్తియై యున్నది. దానజేసి సంసారమునీదుట కొంత
సులభముగా నుండవచ్చు. నాథా! వచ్చికాలఁదికాలమైనదో
లేదో యిప్పుడే భార్యపోరుపెట్టుచున్నదని తలంపకుడు. ఇది
యంతయు సంసారము బీదస్థితియగుటఁజేసి తెల్పితిని.

నామ — ప్రేయసీ! ఇందుఁ బోరుపెట్టుటేమున్నది. సంసారమందుగల
కలిమిలేముల నెఱింగి తగు సదుపాయంబుల నాలోచించి భర్త
లకుఁ దెల్పుట కులకాంతలకుఁగల సహజలక్షణము లేకదా!
పురుషుఁడగు వాడింత తెచ్చువరకే కాని యద్దానఁగల వ్యయా
వ్యయముల సమగ్రముగా నెఱింగి మెలఁగునఁ బ్రవర్తించు
వారలు కాంతలేకదా? కాని హరిపదధ్యాన లాలసుఁడనై
యెచ్చోటనో నిశ్చింతముగాఁ గాలముఁ గడపు నాకీ బేరమునఁ
గల సారము తెలియుఁగు టెట్లు? అదిగాక వ్యాపారమును జేయు
టసవ్యవృత్తియుఁగాను. అద్దానికిఁ బ్రథమసోపానమనృతము.
రెండవది వాక్చాతుర్యము. మూడవది యాకర్షణ ఇవి
యన్నియు నేర్చినఁగాని యందుండు సాధక బాధకముల నెఱుం
గనలవిగాదు. ఇందొక్కటియు నాకు నేర్పరాఁగాను. ఇట్టి
చోవ్యాపారి మోసములఁ జేయగలనాఁడని చింతిలువాడ హరి
గుణవ్యాపారమునందు లగ్నమగు నామనంబీ వస్తుమూలక వ్యా
పారమునందు లగ్నమగునా? ఒకవేళ లగ్నమైనను గించిత్కా
లమేకాని కలకాలము నిలువఁబోదు. సత్యవాదినై బేరము
సల్పినఁ జిల్లిగవ్వయేనియు లభింపదు. అట్టితఱి జానెడు
పొట్టకై యీవృత్తి నవలంబించి యనృతవాదినగు టెట్లు?
వ్యాపారమునందుమున్గి, వాడవాడలఁ దిరుగుచు నా పాండు
రంగని సేవల సేవగించు టెట్లు? మానినీ! ఇట్టి వ్యాపారము
నెటుల సల్పువాడ? ఇంతకాలంబునుండి యన్నపానంబుల నిడి
రక్షించిన పాండురంగడు నేడు భక్షించునా?

రాధ—[భయముతో] నాథా! పౌరుషమొనర్చికదా దైవముపై నాధారపడుట. పురుషయత్నంబున ధనార్జనంబున కొక వ్యాపారమేగాదు. పెక్కుమార్గములింకను గలవు. అందిప్పటికాలము ననుసరించి, గౌరవము, పలుకుఁబడియు, ధనము, మున్నగునవి చేకూర్చి సుఖింపఁజేయునది యుద్యోగము. కాన యేభూపతిప్రాపునో సంపాదించుకొని సంసారమునీదుదు.

సోమ—(నవ్వుచు) తలోదరీ! ఎంతపిచ్చిదాననైతివి. ఒకపట్టున నింక వ్యాపారముమంచిదగునుగాని యన్నిఁటియందును దుచ్ఛమగు నుద్యోగము మంచిదగునా? ముందు భూపతిప్రాపును సంపాదించుకొనుటకై యాతని వాకిలిఁ గాయుచు ముఖస్తుతులను జేయుచుండవలయు. అటులఁ జేయుచుండ నాతని కెప్పుడో కించిత్కరుణకలిగి యొక యధికారపదవి నొసంగును. నాటినుండియు నాతనికిఁ బాదాక్రాంతుఁడై తన స్వాతంత్ర్యము సర్వము నమ్ముకొని యాతఁడు కూర్చుండుమనినఁ గూర్చొని నిలువుమనిన నిలచి యడుగులొత్తుచుండవలె అప్పటితో స్వేచ్ఛావిహారమనుమాటయే లేకుండఁబోవును. ఇప్పటికిదెంతనీచవృత్తియైనదో తెలియుచునేయున్నది. ఇఁకదీనఁజేసి కలుగు ఫలములన్నను కడువిచిత్రములు అధికారపదవియబ్బినతోడనే యట్టివాని కెక్కడలేని గర్వమువచ్చిపడి కన్నులు నెత్తికెక్కి కూర్చుండును. అంత తోడివారలతో మాటలాడుటకు సయితము విముఖుఁడగుటయే కాక మీమిక్కిలి యట్టివారల నీచాతినీచులుగా భావించి తన క్రిందివారలని మలకనగాఁ జూచును. ఇవ బుద్ధినంతయు నధికారము వచ్చినప్పటినుండి ధనార్జనమునందే వినియోగించుచు దురాశాగుణ

బద్ధుడై తుదకధోగతిపాలగును. ఒక్కొకవేళ ధనార్జనమునకై నానాబాధలఁ గుడుచుచుఁ గ్రూరకార్యములనేనియుఁ జేయ సమకట్టును. అధికారపదవి యబ్బెగదాయని మిట్టిపడుచుఁ గాలఁదిదూరము నడచినను దనపదవికి గౌరవహానివాటిల్లునని వివిధమార్గముల నీమురికి డొక్కకు బాధఁ గలుగనీయక సాగి పోవుచుండును. దానఁజేసి శరీరమున కిసుమంతయు వ్యాయామము లేకుండుటవలన నానాటికి శరీరపటుత్వము జారిపోవ ననారోగ్యుఁడై యెల్లప్పుడు వివిధజాడ్యములచేఁబీడింపఁబడుచు నేవిధి ధనమును సంపాదించెనో యావిధినే యంతయును వెచ్చించుచుండును. శరీరమున కారోగ్యము లేక పోయిన నో నెన్నిసౌకర్యములున్నను నెంత ధనమున్నను నవియన్నియు నిష్ప్రయోజనంబులు. పైపెచ్చు ప్రబల బాధాకరంబులు. ఇఁక దీనివలనఁ గలుగు దోసంగులు లెక్కింపనలవిగాదు. లంచగొండులుగఁజేయునదియు—కూటసాక్ష్యముల గూయించునదియు—మొగమోటమును బాటింపనిదియు—క్రూరకృత్యంబులకుఁ బాల్పడఁజేయునదియు—ఎదిరి కొంపలఁగూల్చునదియు—దురాశకుఁ గారణమైనదియు—జీవినిఁ బెనుభూతమువోలెఁ బీడించునదియు—జగంబునం దుద్యోగంబుకన్న వేఱొక్కటికలదా? ఇన్ని తెఱంగుల జీవిని నుద్యోగము బాధించుచుండ నాతనికి నిశ్చలత్వముండునా? నిశ్చలత్వము లేని వానికి భక్తికల్గునా? భక్తిలేనివానికి ముక్తిలభించునా? కాంతా వానిశ్చితంబు వినుము.

ఉ. ఆకులలంబులన్ దినుచు నాహరిఁగొల్చుచుఁ గానలందు నే
కాకినఁ గేకికీరకలకంఠ కపోతనినాదమాధురీ
లోకమునందుమున్ని, పరలోకసుఖాకరుఁడౌట యొప్పెదన్
గాక! శరీరికిన్ బరముఖస్తుత జీవనమొప్పునే? చెలీ!

నన్నుద్యోగమును జేయుమనికదా నీవు బాధించుట? ముందుద్యోగంబనిన నొక పనినిసల్పుటే కదా? అప్పుడు నేనుమాత్రము నిరుద్యోగినైతినా? నాకుద్యోగమిచ్చినవాడు పాండురంగడు నేనాత్మయుద్యోగిని నేనొనర్చుపని యాతనిచరణసేవయే నాకాతఁడొసంగునది ముక్తిధనము ఇవ్విధి నేనాతనియుద్యోగినై యనంతసుఖంబులనందుచుండ నిక్కెట్టి యెగ్గుప్రాప్తించెనని యింకొకరి యండఁ జేరుదు?

రాధ—(స్వగతము) ఆహా! ఇట్టిపరమభక్తుని పత్నినగుటచేత నేకదా ప్రపంచమునఁగల కష్టపరంపరల నెఱుంగఁజాలితి. అవును నాథునిపల్కు లైవడి నాసరసిజలోచనుని చరణసేవలకన్నఁ గ్రూరకిరాతు లనదగు ధరాధిపులసేవలు పరమపవిత్రములగునని యెవరుచెప్పఁగలరు? కాని యన్నిఁటియందును గుణమే ప్రధానము. అప్పుడుద్యోగియైనియు గుణవంతుఁడగుచో సజ్జనుఁడేలకాఁగూడదు? అగుగాక భర్తగారుచెప్పిన ప్రకారమొరులకుఁ దనస్వాతంత్ర్యము నమ్ముకొని లభించిన తద్ధనముచే జీవించుట కడునీచమని యొప్పుకొనక తప్పదు. కటకటా! పాండురంగని పూజాప్రభావం బెఱింగియు నుద్యోగమును సంపాదింపుడని యెంతమందమతినై పల్కితి.

సీ. పాండురంగని భక్తునిపత్నినయ్యు
సహజస్త్రీచంచలత పీడఁజాలనైతిఁ
గాక మెట్టులో కోయిలఁగలసినంత
నైజగుణమెవ్విధం బోవునా? తలంప.

(ఆలోచనానిమగ్నయగును)

నామ—కాంతా! దీర్ఘాలోచనము సేయుచుంటివేల?

రాధ—(గద్గదస్వరముతో) స్వామీ! మీరిటులనన్నిఁటికన్ని తెఱంగుల బల్కినచో నేనేమి మాఱుచెప్పఁగలదాన ఐహికసంబంధములగు వృత్తులన్నియుఁ గేవలము పాపభూయిష్ఠములగుచో జగంబుననుండు జనులందరుఁ బాపులేనా? అందరును బాపులగుచో ధారుణీమాత భరింపఁగలదా? ప్రతివస్తువునందును

ప్రతివృత్తియందును ప్రతిజాతియందును వేయేల? సర్వభూత వస్తు సముదాయంబునందును నొకదెసమంచియు నింకొక వంకఁజెడుగును గలసియుండునని పెద్దలు చెప్పుదురు సన్మార్గు లగువారలప్పట్టున మంచియిదియని యెఱింగి యామార్గము ననుసరించి కృతార్థులగుచుండుటలేదా? అక్కారణి మనము కూడ సన్మార్గమున వర్తించినచోఁ బాపమేలవాటిల్లు? కానఁ గులవృత్తిని మంచిమార్గముననే సాగింపుడు. దానధనము లభించుఁగాక లేక లభింపక పోవుఁగాక. అటులనొనర్పుటఁ జేసి పురుషకారము పూర్తియగుచున్నది. అప్పుడు దైవము సానుకూలంబగు.

నామ— మనోహరీ! నీవు చెప్పినది యథార్థము. నేనదియెఱుంగుదు ఉద్యోగమునందు నీకుఁగల భేధాభిప్రాయమును దొలఁగించుటకై యట్టుల నిజముపల్కితి. ఉద్యోగమునకన్న వ్యాపారము కడుంగడు శ్రేష్ఠము దీనియుందొకరికి తన స్వాతంత్ర్యము నమ్ముకొనుటసంభవింపదు. స్వేచ్ఛావిహారమునకు భంగము వాటిల్లదు. క్రూరకార్యములకుఁ బాల్పడవలసిన యగత్యము గలుగఁజాలదు. సంసారభారమును స్కంధమున మోయుట నాకు విధాయకమేకదా? నేటినుండి తల్లిదండ్రుల సుఖభోగులుగఁ జేయువలయు. అదియేకదా మనకు శ్రేయమునుగూర్చునది. గృహస్థుఁడనైనప్పటినో యప్పుడే గృహభారము నాపైనిలచియున్నది. నీయట్టికాంతనాచెంత నిలచియుండ నన్నియుఁ దమంతట తామే చేకూరఁగలవు. రేపటినుండియే కులవృత్తిని సత్పథమునసాగించెద.

రాధ— మనోనాథా! మీమానసమును జాలచింతలపాలుజేసితినిగదా.

నామ—(సప్రేమమున) నీయట్టి సతీమణి నాకు లభించినప్పుడే హృదయమున నిశ్చింతనాటుకొనిపోయినది. ఆహా ప్రేమనిధాన మన నీవేకదా ? (వక్షమున జేర్చుకొనును)

[తెరపడును]

౨ వ రంగము—లక్ష్మీపురము రాజవీథి

(వామదేవుఁ డిప్పటి రేపలను వ్యాపారమొనర్చువానివలె నుండవలయును. [illegible] వ్యాసులు [illegible] చిహ్నములుగల చొక్కాతొడిగికొని పైనవల్లెవాటును మెడకు తులసిపూసలును [illegible] [illegible] పాయును [illegible] చేతియందు [illegible] నామములును గలిగి [illegible] పనికి [illegible] చిన్న [illegible] గనపడవలయును. సేవకుఁడు [illegible] తగినవేషముతో నుండవలయును. [illegible] బీదగసమునంతయు [illegible] నాకాంచుటయందు [illegible])

(ప్రవేశము—నామదేవు. గుడ్డలమూటతో సేవకుఁడు)

నామ—(నిమీలితనేత్రుఁడై) రంగా! ఖగరాజతురంగా!

అ ను బ ం ధ ము. ౧౭.

ఉ. ఏపని నిన్నుఁ గూర్చి జపియించుచు నుండెదు నామనంబు నీ
పాదము సేరఁ బుం బనిచెఁ బాల్పడఁ జేసితి వేమనందు నే
సేవకుఁ బోవునాఁడ? నిపు డెట్టులొకో? సేరము సేయువాఁడ నీ
వాఁడనటంచు నాభయముఁ బాపఁగదే! సిరినాయకా నిధీ

(దిక్కులు పరికించి) కుమారా! ఇంకను సూర్యోదయంబు కాలేదు. కొంత తడవిచ్చోట వేచియుండి పురప్రవేశ మొనరింతము.

[ఒక సిటిపట్టునఁ గూర్చుండుదురు]

సేవ—తండ్రీ! అరుణకాంతులు వ్యాపించుచున్నవి.

నామ—కుమారా! ఇప్పటి ప్రకృతి శోభను గమనింపుము. అహా! ఆకసమెంత గంభీరముగానున్నది. తరుపత్రములయందలి మంచుబిందువులు ప్రకృతికాంతమేననొప్పు మౌక్తికంబుల వలె నొప్పారుచున్నవి ఏమి యీ యుషఃకాలభావగర్భిత గంభీరత!

సీ. గంభీరసముదగ్రకదనరంగమనంగ
నల నభోభాగంబు జెలగియుండఁ
మోహరించిన చమూవ్యూహంబులోయనఁ
బ్రాక్పశ్చిమాద్రులు ప్రబలియుండ
నేకమై ప్రేల్చు తుపాకిరవ్వలనంగఁ
దారలొండొంటితో జారుచుండఁ
ఉత్తమహావీరసంయుత శాత్రవులనంగ
నంభోజ కుముదాప్తు లమరియుండఁ

గీ. బ్రబలముగఁ బాఱు రక్తప్రవాహమనఁగ
నరుణకాంతిచ్ఛటల్ దిక్కులలముకొనఁగ
నసజయంబునఁ గుముదాప్తుఁ డడగిపోవ
జయముగాని పూర్వగిరిని భాస్కరుఁడు వొడిచె.

— సూర్యోదయము —

నామ—[బద్ధాంజలియై] తండ్రీ! లోకబాంధవా!

ఉ. ఏయెడఁగర్మనిష్ఠ మునిబృందములొక్కటనీకునర్ఘ్యముల్
వోయుచు మూఁడువేళలను బాలొనరింపఁగ నే పరోపకా
రాయితమానసంబున హితాహితముల్ గుఱుతించి సూర్యనా
రాయణమూర్తి! ప్రోచెదవుగా? జగమందలిభూతజాలమున్.

[కొంతతడవు ధ్యానతత్పరుఁడగును]

సీత—(స్వగతము) అబ్బ! ఎంతతడవువేచియున్న నీయనకు భక్తి పిచ్చియేకాని వచ్చినకార్యమును ముగించుకొని పోదమన్న చింతయే పొడకట్టదు. ఇఁక నేను గూడ నీయనతో గూర్చుండిన నెట్లుండవలెనన్న నట్లులేయుండును. తొందరింపక పోయిన చో నెంతకాలమేనియు నీయన యీపిచ్చిలోఁ బడియేయుం

దును. [ప్రకాశముగ] అయ్యా! ముందు సూర్యాతపంబునకుఁ దాళలేము. పెందలకడనే మన పని ముగించుకొని పోదము రండు. [నడచుచు రాజవీధిని దరియుదురు]

సే॰—[ఎలుగెత్తి] జలతారు చీరెలు—బొమ్మాయి రవికెలు—పట్టు గుడ్డలు—చొక్కాగుడ్డలువ్వోయ్. చౌక! చౌక! మంచి నాణెమైన గుడ్డ!

న మ—ఓరీ! అప్పుడే బేరము సాగించితివా? ఈవీధిని గొనువార లెవ్వరుఁ గాన్పింపరు. ఇంకొక వీధికేగుదము పద.

[మరియొక వీధికేగి నచ్చోటఁ గొందరు బిచ్చకులుందురు]

౧వ-భి—అయ్యా! అయ్యా! ఈరెండు నేత్రాల్లేని కబోదికొక్కడబ్బు దరమం సెయ్యాండి బాబుల్లార. రామ రామ! శివన్నారాయనా! ఒక్క మారాజుకైనా దయరాలేదే?

౧ శెప్పుటకైనా తరముగాదు నా శెల్లెలమొరయినురామా యిప్పుడు నా కుడియత్తములోనొక గొప్పకుర్పు శీరామా.

[ఆవీధినిఁబోవు పెద్దమనుష్యునిజూచి వాడు చెయ్యిజాప నాతడు కరుణ లేక యాతని చేతిమీద బెత్తముతోఁ గొట్టిపోవును]

నామ—[అదిగాంచి తత్తరముతో] అయ్యో! అయ్యో! ఆతఁడెంతటి భూతదయావిహీనుఁడు. పూటికి లేక యడిగినాడని యేదియో యాతని కొసంగకపోవుటయేగాక నోరు తెఱచి యడిగినయా నిస్సహాయుని—.... హస్తమును జాచిన యానిర్భాగ్యుని—కొట్టుటయే. హారిహారీ! ఎంతటి స్వార్థపరత్వము!

౨ బీద—ఈకాల్లులేని కుంటో... దరమంసెయ్యండి తండుల్లారా ఈ దిక్కులేని పచ్చిపి సూడండి సాముల్లారా! అరిఅరీ! ఏతండికి దయలేదే.

౧ యేమిజల్మంయేమి జీవనమో యీమాయకాయం॥
రామయ్యరామా! రంగయ్యసామి॥ యే॥

చ. యేమిజల్మంయేమిజీవనం యేమిశాశ్వతం యేమిసౌఖ్యం
యేమినాపాలుద్ధకల్మం సామిసన్నిటు శేశిమరశేను॥

[కొందరు పెద్దమనుష్యులాదారిని బోవుచు వానినిఁ
బలుదుర్భాషలతో కసిరి కొట్టుదురు]

(బిచ్చకులందరు మొరపెట్టుచుందురు)

నామ—[కడువిచారముతో] కటకటా! లోకమున నెందరు జీవులు మలమలమాడుచుండిరి. పురమునుగాంచినంతనే లక్ష్మీపుర మనునామము సార్థకమేయని యెంచితినే? ఇట్టి పురంబునఁ గూడ బీదజనులెటులఁ బరితపించుచుండిరి. సకలైశ్వర్యము లందులందూగు నీప్పోటివాసులీపేదలకు సాయమొనర్పరైరి కదా? హా! వీరికిధనముండిన నేమి? మండిన నేమి? తోటి సోదరులిటుల, దిక్కులేక దీనభావమున నలోలకు సాయని విలపించుచుండఁ గన్నులారజూచి, యిసుమంతయుఁ బ్రేమఁ జూపక, యీకట్టికిఁ హీనులై దిక్కుమాలినవారల హింసించుటయా? పరోపకారబుద్ధియే లేకున్నచో నీసాధములు-ఈవైభవములు-అన్నియుఁ గౌరమాలినవి కావే. భగవంతుండేనియు లోభులకే సర్వసంపదల నొసంగునుగాని యిట్టి నిరుపేదలకు సాయమొనర్పడుగదా? ఈశరీరములు- ఈభోగములు-ఇవియన్నియు శాశ్వతములా? (ప్రకాశము) ఓపురవాసులారా! ఓధనాకరులారా! భూతదయ నించుకయేనియుఁ జూపరేల? ఇందరుదీనులిప్పట్టణంబున వాపోవుచుండఁజూచి యెట్టుల సహించుచుంటిరి? మీకుఁబరోపకారమనుమాటయే లేదా?

ఉ॥ స్వార్థములన్ బ్రియాసపడి వచ్చుట నీవపుడుంజావుగాదె? స
త్యార్థులు మున్ను త్యాగులయి దానము సేయరె? సర్వసంపదల్
వ్యర్థము విత్తమంచు ననవారయుఁ గావరుగా? పరోపకా
రార్థమిదంశరీర మనునార్యవచోక్తినెఱింగియుండియున్.

ఎంత మొత్తుకొన్న నేమి లాభము? కరుణయను మాట సిరిల హృదయంబున జాగరితమగుచున్నంగదా తెల్పెదు బోధలు తలకెక్కుట? [పేదలదిక్కై] సోదరులారా! వాపోవకుడు.

[మూట విప్పుచుండును.]

సేవ — (స్వగతము) అయ్యో! ఇంకేమున్నది? అంతా అనాగరిపోవు చున్నది. అయ్యగారి తీరంఅయింది. అనుకుంటే యేమున్నది. ఈవిలువగల వలువలన్నియు వీరిపాలుగావలసినవే. శాబోలు ఓరి వీండ్లముండమొయ్య యమదూతలవలె పిక్కళ్ళక్కడ దాపు రించినారురాబాబు. పిళ్ళని తట్టిసంది వలన లాభమేమున్నది మాన బంగారం మంచిదికారాద? ఇతకు యీయన సరిగా షేరం చేస్తాడని యెవరనుకొన్నారు అందుకనే యీయనతల్లి నాకెంతో బోధచేసి పంపినది నేనిక్కడచేయునది యింకేము న్నది. నేచెప్పినా వినేబుద్ధిగలవాడుకాడు అయ్యో! ఆగుడ్డల మూట నాదగ్గరన్నా ఉంచుకొనకపోతి. ఈగొడవ అంతా నాకెందుకు? నాదారినాది. అయ్యగారిగారి అయ్యది.

(నిష్క్రమించును.)

అం.బీద. — బాబూ! ఇంతపట్నంలో మీకొక్కరికే దరమంతుంట్లు మామీదఒకరికి యీడదయలేదునాయనా?

(నామదేవుచుట్టు మూగుదురు)

నామ — ఆహా! వీరి దీనాలాపములవిన నెవ్వరి మనంబు కరుగకుండును. ఈనగరవాసు లెంతటి కఠినచిత్తులు? సోదరులారా! క్షమము

ధనమని పారికుఁగొడుటయే కాని పోవునప్పుడు వెంటఁగొని యెవ్వరుఁబోఁజాలరు. తనకాలమున భూతదయాపరతంత్రుఁడై యెవ్వఁడుండునో యట్టివాఁడే సకలజనములచేత నుతియింపఁ బడుచుండు. మనకు స్థిరమను పదార్థమెద్దియును లేదు. సంతతము పాండురంగని భజనలుసేయుఁడు. అతఁడేమనకు సర్వవిధములఁ దోడగువాఁడు. రక్షించువాఁడు.

(తనయూటనున్న ద్రవ్యము నందరికిఁ బంచిపెట్టును)

బీ. అం——(సంతోషముతో] సామీ! మీకడుపు సల్లన యీయూళ పొద్దున మాకింతగంజి కలిగింది బాబూ.

అ ను బం ధ ము ౧౭

జయజయరంగయ్యసామీ.

(నిష్క్రమింతురు.)

నామ——[స్వగతము) ఇక్కడికి వ్యాపారమున గణించిన విత్తము నంతయుఁ బంచిపెట్టితిని. చేతఁ జిల్లిగవ్వయేనియు లేదు. ఇంక కొన్నివలువలు కలవుకదా? వానితో వ్యాపారమొనర్చెద. ఇదంతయుఁ బాండురంగనియాజ్ఞయేకదా? హేమహానుభావా!

శ్లో॥ సజయతువనమాలీ రాధికానందశాలీ
రిపుకులబలహంన్తా పీశగన్తా సమన్తా
హిమకిరవదనాభిర్గోపికా భిశ్రితాంగః
కరకలితరథాంగో నీరదశ్యామలాంగః॥

[భజనసేయుచు నిష్క్రమించును]

(అవనికజారును)

ఇది చతుర్థాంకము.

ఓమ్.

# భ క్త నా మ దే వు

## పంచమాంకము.

---

### ౧ వ రంగము. ఒక సత్రము.

(ఆనాఁడు హరివాసరమగుటవలన నామదేవు వ్రతదీక్షాపరుఁడుగా నుండవలయును. పట్టువస్త్రమును గట్టుకొని నడికట్టుగట్టుకొని పైనఁ దశేయంగ వస్త్రము నొకదానిని వైచికొని యురమునను బాహువులను మోమునను వైష్ణవ నామములఁ బెట్టికొని కాళ్ళకుఁ గజ్జెలుకట్టుకొని చేతియందు భజనపుబలకలు దరించి హరిభజనలాలసుఁడై యుండవలయును. రాధాబాయియుఁ బీతవసనంబును నట్టికంచుకంబును, జారుముడిగల సిగయు మున్నగువానిఁగలిగి తదనుకూలంబుగా నుండవలయును. వృద్ధబ్రాహ్మణుఁడు సముచితవేషమును ధరించి యెక్కువ పట్టుదలగలభావముగలవాఁడై యుండవలయును.)

[నామదేవు భార్యాసహితుఁడై తీర్థయాత్రల కేగుచు సత్రమున బసచేయును]

నామ — కాంతా! నేఁడు హరివాసరము. నిరాహారులమైయుండవలయు

రాధ — నాథా! అతిథులెవ్వరేనివచ్చినచో వారల సంతృప్తులఁ గావించుటెట్లు?

నామ — కందమూలాదుల నొసంగి యర్చింతము.

రాధ — నాకీ సందియమును దీర్పుము. నేము నిరాహారులమైయుండవలయునని మీరు పల్కితిరిగదా? అతిథులకుఁ గందమూలఫలంబుల నొసంగినచో నాహార మర్పించినవారలమగుదుము కదా?

నామ — ప్రేయసీ! చక్కని [illegible] తివి. ధర్మసూక్ష్మత యనఁగా నిచ్చోటనే నిలదియున్నది. చూడుము. ఘోరాటవులయందుండుఋషులు కొందరు కందమూలముల స్వీకరిం

చియుఁ గొందరు వాయుభక్షకులయ్యుఁ గొందరు పర్ణభక్షకు
లయ్యుఁ బెక్కువిధంబులఁ దపములసల్పిరికదా. పైనిచెప్పిన
వానిని భక్షించుచుండినను వారలందరు నిరాహారులే అందు
లకుఁగారణమో? మనకు సరియగు నాహారమేది? భోజనము.
అన్నానిని వదలి తదితరములగు నెన్నియాహారములఁ దినినను
మనకుఁ దృప్తికలుగఁజాలదు. సర్పమునకు గాలియాహారము.
అది గాలిని భక్షింపకుండ, దక్కినవి యెన్నిభుజించిన నది
తృప్తిపడఁజాలదు. అటులే మనకు నాహారములుగాని వాని
నుపవాసవ్రతములయందొసంగినను దోషము కలుగఁజాలదు.
హరివాసరవ్రతాచరణులగు వారు మాత్రమానాడు జలాపా
నమేనియుఁ జేయఁగూడదు. మనవలె నందరుండినచో నెవరికి
వారలే నిక్కముగ నిరాహారులైయుందురు. మున్ను గాం
గదుఁడు తన ప్రభావముచేత సకలజంతుజీవకోటిని నిరాహా
రిఁగాఁజేసె. కావున్న అతిథులెవ్వరేని వచ్చినచో నేకా
దశీవ్రతమాహాత్మ్యమును గురించి తెల్పి నిరాహారులై యుండు
నటుల సల్పుదము. కానిచో ఫలంబులొసంగి పూజింతము.

(ఇంతలో నొకవృద్ధుఁడు క్షుధాగ్ని చేఁగూలుచువచ్చి నామదేవుముందఁగూలఁబడును)

నామ—[తత్తరముతో] స్వామీ! ఈస్థితి మీకేల కల్గినది ?

వృద్ధు—(క్షీణస్వరముతో) అయ్యా! ప్రాణములు పోవుచున్నవి పిడికె
డన్నముం బెట్టి పుణ్యముఁగట్టుకొమ్ము.
(కన్నులఁ దేలవేయును)

నామ—(కనువిచారముతో) మహాత్మా! నేడు హరివాసరముగదా?

వృద్ధు—అయ్యా! నాకీవ్రతము లేమియు నక్కరలేదు. ముందింత కబ
ళము నొసంగుము.

నామ—కాంతా! కందమూలాదులఁ దెచ్చి మహాత్మున కర్పింపుము.
[రాధాబాయిలోపలికరుగును]

వృద్ధు—(శోషనభినయించుచు) నీకందమూలములు నాయాకలినిఁదీర్ప జాలవు. నాకవియేల యర్పించెదవు. నాకుఁగావలసినది భోజనము దక్క పెరవస్తువు లేమియు వలదు. వృద్ధునకొకింత సాయముఁ జేయలేవా?

నామ—మహాత్మా! అతిథిపూజలు సలుపలేకగాదు. నేడేకాదశికదా? ఏకాదశినాడు భోజనము స్వీకరింపఁగూడదని పెద్దలు చెప్పిరి కదా? అట్టి పుణ్యతిథియందు దేవతలుసయితి మా విష్ణుమూర్తిని నేకదీక్షతో భజించి కృతార్థులగుచున్నారు. అప్పుడు మర్త్యులమగు మనము పక్షమునకొక్కదినము భగవంతుని నిరాహారులమై భజింపఁజాలమా? తండ్రీ! నీయాకలి బాధ యీఫలంబులచేఁ గొంత సమసిపోదా? నేడంటరాని పదార్థమును దెమ్మనుట భావ్యమా? పెదలు మీరు మాకు నీతిఁజెప్పి ధర్మమార్గమునకుఁ ద్రిప్పి సద్వ్రతముల నాచరించు నటుల జేయవలెఁగాని నీరీతినిఁ గోరుట న్యాయమా? హరివాసరవ్రతము ననుష్ఠించియేకదా సకలజీవులు రుక్మాంగదుని పరిపాలనయందు మోక్షముఁబొందినవి? మహామునులు సయితి మిద్దానిని సల్పియేకదా తరించినది? స్వామీ! ఒక్కనాటికి ఫలంబుల నారగించి మీ యాకలి నణంపుకొనఁజాలరా?

వృద్ధు—ఓయీ! ముందిచ్చోటఁ బ్రాణంబులు పోవుచుండ వ్రతము వ్రతమని స్వస్తిచెప్పెదవేల? తలప్రాణము తోకకు వచ్చుచున్నది. భోజమునొసంగవా?

నామ—తండ్రీ! నేటిదినమున నొసంగఁజాల.

వృద్ధు—(నోటిమీదచేయినై చికొని] అయ్యో! జీవుడా! నీవెంత యారాటపడుచుంటివోయి. అయ్యో! అయ్యో! కన్నులు తిరిగిపోవుచున్నవి. అయ్యా! నామదేవు! నీవేమో అతిథిపూజాసక్తుఁడవని యిచ్చోటికివచ్చినందులకుఁ పిడికెడన్నమును

జెట్టనైతివిక దా? ఇది యేనా నీయతిథిపూజాస్వభావలక్షణము? కుమారా! ప్రాణముపోవుటకు సిద్ధమగుచున్నది. కనికరముంచి యిప్పుడేనియుఁ గొంతయన్నము నొసంగుము. ప్రాణదానము కన్న నీవ్రతమెక్కువా?

నామ — స్వామీ! మీప్రాణముపోయినచో నాప్రాణము మాత్ర ముండునా?

వృద్ధు — నీయుపన్యాసము గట్టిపెట్టి రక్షింపుము రక్షింపుము. అన్న దాన మొనర్పుము.

నామ — (విచారముతో) ఒనర్పఁజాలనందులకు క్షమించి యిప్పటికి ఫలముల నారగింపుము.

వృద్ధు — (కనులుమూసి) ప్రాణములు పోవుచున్నవి కుమారా! రక్షింపుము.

నామ — నాప్రాణములుగూడ రాఁగలవు తండ్రీ!

వృద్ధు — ముగిసినది. పిడికె......డ......న్న......

(నిర్జీవుఁడగును)

నామ — (శిరమును మోఁదుకొనుచు) హా! హా! తండ్రీ! గతించితివా! గతించితివా! అయ్యో! పాండురంగా! ఎంతటివిపద్దశఁ గలిగించితివి. అతిథిపూజా గుణోపేతుఁడనని పేరువహించి చేతులార వృద్ధునిఁ జంపితినే? హరిహరీ! నాజన్మమేల కాల్పనా? ఎందరికో యన్నదాన మొసంగితినే? కటకటా! వ్రతదినమందే యీ వృద్ధుఁడిటుల నన్నదానముగోరుటేల? (పెద్దపెట్టున శోకించుచు) ఒకనిస్సహాయుని ప్రాణముల నిలువునఁ దీసితినే. ఇంక నా యీ శరీరమేల? అయ్యో! అయ్యో! రామా ఇదియంతయు నీమహిమయేకదా? ఈ వ్రతగుణంబుల నివ్విధిఁ జేకూర్పటేల? నన్ను వ్రతదీక్షాపరుఁగా జేయనేల? ఈ వృద్ధుని నేఁడీనాయింటకుఁ జేర్పనేల? ప్రాణముల హరింపనేల?

అయ్యయ్యో! తండ్రీ! ఫలములనారగింపుమని యెంతవేడినను విననైతిగదా. ఫలముల నారగించినచో నీదుస్థితి సంభవింప నేరదుగదా. రంగా! ఎంతలో నెంతటిమార్పుఁ గలిగించితివి.

## అనుబంధము ౧౭

ఉ. యాచకపాళికేయెడల నాస్తియటంచును జెప్పలేదు కా
ణాచి నొసంగుమంచు నెఱవచ్చినవారల రిత్తవుచ్చలే
దేచరకేని డీకొనుచునే గడియించితి నీదుసేవ! శే
షాచలవాస! నేడిపట హా! యాకవృద్ధులఁ జంపితిఁగదా ?
(విలపించుచుండును

రాధ—[తత్తరముతోఁ బ్రవేశించి) నాథా! నాథా! ఇదియేమి?

నామ—హా! కాంతా! అతిథి హంతకుడనైతిఁగదా?

రాధ—[మిగుల విచారముతో] హా! హా! నేడెట్టిమాట వినవలసి వచ్చె. హా! పాండురంగా! మేమేమియపరాధ మొనర్చితిమని యిన్ని చిక్కులఁ బెట్టుచుంటివి? సంతతము నీచరణసేవలకన్న నన్యమెఱుంగమే? ఒకరికిఁ గీడుఁజేసియుండమే? అయ్యయ్యో! తండ్రీ! ఎంతటిదుర్భరసంతాపమును గూర్చితివి? నీదాసులకే యిట్టిసంకటములు గల్పించుచుంటివి. దీనులమగు మాపై నింతటి కోపమూనుటేల? మాకు నీకన్న వేఱొండు శరణంబు గలదా? తండ్రీ!

## అనుబంధము ౧౮

శా. హా! కృష్ణా! ననుఁబ్రోవవే యనుచు దీనావస్థయందుండి ని
న్నే కాంక్షింపఁ బటాలి ద్రౌపదికి నెంతేనిఁ గటాక్షింపలే
దే? కాత్యాయనిపేల మాకుఁ నిటు రావే! యనుచుఁబ్రోవవే!
యాకారుణ్యము మాయెడన్ జూపవే దేవా! పాండురంగప్రభూ!
[కొంతతడవు ప్రార్థించును]

[కొలఁదిధైర్య మవలంబించి] నాథా! దైవ కృతంబును దప్పింప సమర్థులెవ్వరు? భగవదిష్టానుసరణి జరుగు కార్యంబుల మరల్పఁగలమా?

నామ—కాంతా! నేటితో నాప్రాణములుగూడఁ జెల్లఁగలవు.

[ఇదంతయు విని సత్రమునఁగల జనులచ్చోటికివత్తురు]

జను—(శవమునుగాంచి) హాత్యా! హాత్యా! అయ్యో! మూఢుడా! అన్యాయముగా నీవృద్ధునిఁ జంపితి వేల?

నామ—[దీనవదనముతో] భగవదుద్దేశమున కెవరేమి చేయఁగలరు?

జను—ఓరిక్రూరుడా! మాటలాడుటకింకను నీకు నోరెట్లువచ్చుచున్నదిరా? ఇది భగవదుద్దేశమా? చేతులారఁ జంపి తప్పించుకొనుటకై చూచుచుంటివా? ఈనగరమునకింక నంతటి యరాజకీయము సంభవింపలేదు. ఇప్పుడే భటులు రాగలరు.

(కొందరరిగి భటులను దీసికొనివత్తురు)

భటు—అరే అల్లా! షట్టుఫకల్ ఖూని? మాపాదుషాగారికి చలో ఆడ నీకీ తగ్గదండా చేస్తారు. బేగిచలో.

(అని చెయ్యిబట్టి లాగుదురు)

నామ—(కడుశాంతిముతో) భటులారా! నాకు మీ పాదుషాగారి విచారణ మక్కరలేదు. నాకు నేనే విచారించుకొనఁగలను. ఇప్పుడే యీతనితో నాప్రాణములను సమర్పించుకొనుటకు సిద్ధమైయున్నవాడ. మీరాజుగారింతకన్న నెక్కుడేమి చేయఁ గలఁడు.

భటు—మాకీ నీతుల్ గీతుల్ నై. నీకీ ఫట్టుకపోవటం మాదీపని.

[చేతులకు సంకెళ్ళు వేయుదురు)

రాధ—[పట్టరాని దుఃఖముతో] హా! నాథా! ఎంతటివాని కెంతటి దుస్థితి సంభవించినది.

సీ. హరిపూజలే కాని యన్యంబు నెఱుఁగని
కరములు కఠినసంకెలలఁ దగిలె!
హరిసేవయే కాని యన్యంబు నెఱుఁగని
భావంబు నరహత్యపాపమందె!
హరికీర్తనమె కాని యన్యంబు నెఱుఁగని
శ్రవణముల్ పరుషభాషణములవినె!
హరిధ్యానమే కాని యన్యంబు నెఱుఁగని
మనము మహీశుశాసనము వడసె!
గీ. కటకటా! భక్తుఁడేడ? యీ కలుషితునకు
దండనలకుఁ బాల్పడుటేడ? దైవమా! స
కల చరాచరముల నొక్క గడియయందె
యుచ్చపోస్పన నాడింతు వెపుడు నగుచు.

[అని విలపించును]

నాసి.—[చిఱునగవుతో] కాంతా! పామరత్వమును విడుము. సుఖదుఃఖములు ప్రాణికి సమానములు. సుఖకాలమున సంతోషము దుఃఖవేళల విచారము నొందుట ధీరలక్షణము గాదు. అన్నిటిని భరించి యేకముగ నుండుటయే మెచ్చఁదగినది. నాదుస్థితికై విచారింపకుము. ప్రాకృత శరీరములు భేదములైనను మన యాత్మలు గలసియే యున్నవి. ఆత్మను భేదపరుప నెవ్వరుఁ జాలరు. మన యాత్మలు రెండును నొకేకరణి మెలఁగునంతకాలము మనకు విచారమేల? ఎప్పటికేనియు నీదేహములు నశించునుగాని యాత్మలు నశింపనేరవు. ప్రేయసీ! విచారముడిగి సుశీలవై యుండుము. పరాత్పరుని భజించుచుండుము. అన్నిటికి నాతఁడే రక్షకుఁడు. శోకింపకుము. (భటులతో నిష్క్రమించును)

రాధ—హా! నాథా! (మూర్ఛిల్లును)

(తెర వ్రాలును)

## ౨ వ రంగము. పాదుషా దర్బారు.

(నామదేవు యథాప్రకారవేషముననే రంగమునఁ బ్రవేశింపవలయును. కోపభావమేమాత్రము లేనివానివలెను సేవలను నగుమొగంబుననున్న వానివలెను గన్పడవలయును. పాదుషా వేషధారణము బంగారుజరీపనిగల మొహమ్మల్ అంగరఖాను దొడిగికొని గాజరీబనిఁదలప్ప సకల చిహ్నంబులదాల్చి యుండవలయును. రాయజీ హిందూమతానుసారముగను భక్తుని విధముగను మంత్రిపదవిఁ దలుపునందమునను వేషమునుదాల్చి యుండవలెను.)

[తెరనెత్తఁగాఁ బాదుషా మొదలగువారలాసీనులై యుందురు]

పాదు—రాయజీ! మీదీహిందూమతం ఖూనీల్ పే శేమతం. దీన్కే బడామతం హిందూమతంఅని చెపుతావే.

రాయ—ప్రభూ! తొందరపడి హిందూమతమును దూఱవలదు. ఆభక్తసింహునిటకు రప్పింపుడు. ఆతఁడే తనమతిమత్యుత్తమమని నిరూపింపఁగలడు

పాదు—అజీ! అచ్ఛా! (భటులదిక్కై) అరే! ఆతన్కి గొప్పగా పట్కురాండిరా ?

(భటులరిగి నామదేవుని నిర్బంధితునిగాఁ దీసికొనివత్తురు)

నామ—పాదుషావారికివే ధన్యవాదములు.

పాదు—మీహిందూ పసువుల్కెంత జ్ఞానమా ? ఫట్టుఫగల్ ఖూనీ పేస్తావే ?

నామ—రాజా! ప్రతికర్మానుసరణి నట్టులజరిగెనేకాని యిందు నాతిప్పేమియు లేదు.

పాదు—ఖూనీ పేస్తాన్కి ప్రతంకియెంద్కు ? ఇంత హన్నంపెట్కే పొయ్యావ్. ఎంతబడామతం మీది హిందూమతం.

నామ—రాజా! హిందూమతమును దూఱవలదు.

పాదు—అరే! తాళ్ళకీ మొక్కేది హిందూమతం. పాపుల్కి మొక్కేది హిందూమతం బూడ్దెకిపూసేది హిందూమతం. అచ్ఛామతం కానైజీ

నామ—(శాంతముతో) అయ్యా! హిందూమతస్వభావమును సమగ్రముగా గ్రహించినచో మీరిట్లు పలుకరు. ఏద్దానినిగూర్చి విచారించినను మూలముననుసరించియే విచారింపవలె. హిందూమతమసామాన్యము. అంతయుఁ బరమాత్మస్వరూపమే పరమాత్ముఁడు నిర్విశేషుఁడయ్యును విశేషమధ్యమున వ్యక్తుఁడగుచున్నాఁడు. నిరాకారుఁడయ్యు ననంతాకారుఁడగుచున్నాఁడు. విశిష్టుఁడయ్యు నిర్విశిష్టుఁడగుచున్నాఁడు. హ్రస్వదీర్ఘస్థూలసూక్ష్మానంద ప్రవాహమాతనిదే. రాజా! దేశమునకంటె నత్యుత్తమమైన పదార్థము దేశమునుండియే వెలుగొందుచున్నది. పరాత్పరుఁడిట్లే తనచిత్రఫలకము నందనంతమగు తనస్వరూపమును వ్యక్తపఱచుచున్నాఁడు. సత్యమేకమైనదనియు, నేకమతగుణాకలితంబగు నదే సత్యమనియు నేకమతసంబంధమై యేకమాత్రస్వరూపమున బ్రకాశించునదే సత్యమనియుఁ దలంచువారు కేవలము నేకమతసంబంధమగు సత్యమునే గ్రహింపఁగలరు. కాని యనంతమగు ననేకమతసంబంధసత్యమును వారు గ్రహింపజాలరు. అనంతమగు నేకత్వ మనంతమగు ననేకత్వమునందుఁ దన్నుఁ బ్రకాశింపఁజేసికొనుచున్నది. సమత్వలిద్ధానిని గ్రహింపఁగలరు. ఇయ్యదిహిందూమతమునందు [illegible]ంచుచున్నది ఇతరమతము లన్నియు నీశ్వరునిఁగొలదిగనో మొక్కడుగనో యనేకవిధముల విశేషమధ్యమునబాధించుటకుఁ గడంగుచుండును. హిందూమతముగూడ నీశ్వరుని విశేషమధ్యమున నుంపవలెనని కోరునుగాని యావిశేషమే [illegible] మాత్రస్వరూపమనియు నేక

గుణప్రధానమనియుఁ బరిగణింపదు. పరాత్పరుఁడా విశేష మునకనేకములగు గుణములచే మించియున్నాఁడని ప్రతిభక్తు డును దలంచుచునేయుండును. సాకారమందును నిరాకార మందును విశేషమందును నిర్విశేషమందును దీర్ఘమందును హ్రస్వమందును స్థూలమందును సూక్ష్మమందును ధ్యానము నందును దర్శనమందును నెవ్వఁడు సత్యమైయుండెనో యట్టి వానినే హిందూమతము నాల్గుగుణంబులచే సాధింపుటకై ప్రబల యత్నములను జేయును. రాజా యిదియే హిందూమత ధర్మవిశేషము.

పాదు—అచ్ఛా! మీరిక్ యింతా శెల్వీవుంటే తోక్యే రాళ్ళని పూజ చేస్తారెందుకు భాయ్.

నామ—భూవరా! దానియందుండు మహిమల సీవెఱుంగక యిట్లుపల్కుచుంటివి మీరు నిరాకారముగ నమాజుఁ జేయుదురు. సాకారమును గొల్వరు అప్పుడు సాకారమునందు మీమతము భేదబుద్ధినిఁ జూపుచున్నది హిందూమతమట్లుగాదు ఆకా రనిరాకారములను నొకేబుద్ధినిఁ భావించును. విగ్రహారాధన మొనర్చునపుడా శిలలకు భగవంతుని వ్యక్తిత్వము నారో పించి యన్నిటియందును సత్యపదార్థమును భావముచేసి హిందూమతము పూజించును పరాత్పరుండు సకల చరాచరం బులయందు సూక్ష్మరూపమున వర్తిలుచున్నాడు అట్టిసూక్ష్మ రూపము నన్నిటియందుఁ గనుగొనుటకే హిందూమతమన్నట్లు ప్రబలయత్నముల నొనర్చుచున్నది ప్రతిజీవమును బరబ్రహ్మ స్వరూపమే శిలయందును బరమాత్మ స్వరూపమునుగలదు ఆ పరమాత్మను గురించియే హిందూమతము పూజలొనర్చును.

నిరాకారమును నిశ్చలచిత్తంబున నందరును గొలువ జాలరు. అది మానసికపూజ మనమునందే పరాత్పరుని స్వరూపమును గాంచుచు నాభావప్రకటితమగు రూపము నందే చిత్తమందరికి లగ్నము గానేరదు అట్టి చంచల చిత్తములకై యీ విగ్రహారాధన మేర్పడినది. మానసికారాధనమందుఁ దన యాత్మ నెఱింగినవాఁడే కృతార్థుఁడు గాఁగలవాఁడు. ఆత్మ నెఱుంగఁ బోయినచో నాత్మరూపమున మెలంగు బరమాత్మ స్వరూపమును గన్గొనఁజాలఁడు. అట్లు లగుటఁ జేసి యెల్లర కనుకూలంబగునట్లు నొకవస్తువునందు పరబ్రహ్మస్వరూపమును వ్యక్తపరచి యెదుటఁ బ్రత్యక్షభావమున నితఁడే పరాత్పరుఁడని తెల్పుచున్నారు సర్వసముఁడగు వాని కన్నియు నొకటే. భేదమును మాటయే యుండదు. అన్ని మతములును భగవత్స్వరూపమునకు సమానములే.

పాదు— అచ్ఛాజీ! ఏక్ భేదం లేక్ పోతే మా దేవుడ్కి కోల్వూ భాయి.

నామ— రాజా! నీకింకను సమానబుద్ధి కలుగలేదు. నీకొక దేవుఁడు నాకొక దేవుఁడుగలఁడా? మనకెల్లరకు గగనతుల్యుఁ డొక్కఁడే. ఆతఁడే పెక్కు నామంబులచేతఁ బిలువఁబడుచున్నాఁడు. మీరు "అల్లా" యని పిలచిన మేము "కృష్ణా" యని పిలుతుము. వీనియందు భేదముచ్చారణయందేగాని భగవత్స్వరూపము నందేమాత్రమును లేదు. ఇదియె యెఱుఁగవలసిన పరమరహస్యము. సకలజీవముల కొక్కదానియందే బుద్ధి నుండుట దుస్తరము. అట్లగుటఁ జేసియె తదనుగుణ్యంబుగ భగవంతుఁడును బెక్కు నామంబులను బెక్కు రూపంబులను దాల్చి యే నామముచేఁ దన్ను సేవించినను రక్షించుచున్నాఁడు. ఇద్దానికై భేదమునెంచుటేల? నములయందుఁగల తోయము పెక్కుమందిచే హరింపఁబడుచు నాసమయంబుననే పెక్కు

నామంబులచే నయ్యది పిలువఁబడుచున్నది. మీరు 'పానీ' యనిన మేము 'పానీయ'మందుము ఈ రెంటికిని ప్రధానవస్తువేకస్వరూపమేగదా? అర్థానియందు భేదమున్నచో నప్పుడు భగవంతుడేకస్వరూపుఁడని పిలువంబడఁడు. అదిగాక—

మ. మనుజాధీశ! నదీనదంబులవి యేమార్గంబునం బోయినన్
వనిధిన్ జేరుట లేదె? యంతమున భూభాగంబునం దివ్విధిన్
మనుజుల్ పక్కిరు పెక్కునామముల సంభావించినన్ భార్గవీ
శునిఁ జేరన్ దుదకన్నియున్గలని సంశోధింపఁ దత్వంబులన్.

పాదు—భాయీ? నాకీ మీమతం గొప్పతనాన్కి గొప్పనిదర్శనం సూపిస్తావ్.

నామ—రాజా! భగవదేచ్ఛ యటులున్నచోఁ దప్పింపఁగలమా?

పాదు—అచ్ఛా! మీదేవుడ్కి సూస్తాం. ఈవచ్చినమన్సీకి లేపాలె నైతో మతం గితం ఛోడ్ దేవ్. నీఫానాన్కిగయా. ఏం సేస్తావ్.

నామ—నన్నడుగనేటికి? అన్నిఁటికి నాపాండురంగడేకలఁడు.

పాదు—సరే లేపు సూస్తామ్.

నామ—(బద్ధాంజలియై) హే పరమపురుషా! ఎంతటివిచిత్రనాటకమున నిల్పితివి. నేఁడుగదా నీభక్తవాత్సల్యమును జూపుట. నాఁడు విప్రకుమారరక్షణార్థమై నీచెలికాఁడు ప్రతినవట్టినఁ బ్రేమమును జూపించితివి. తండ్రీ! నేఁడు నన్నుఁ బాలింపుము. ఈ వృషభుని సజీవునిఁగా నొనర్పుము. నీశక్తిసామర్థ్యముల నీభూనాథుని మ్రోలఁ బ్రకటించి యాతనికిఁగల యజ్ఞానమును దొలఁగింపుము. ఆతని హృదయమ్మున నీమహిమల నెలకొల్పుము. దేవా! సర్వశక్తిపరిపూర్ణప్రభావా!

అనుబంధము ౨౦

సీ. సృష్టింప భేదింప శీలింప నాలింప
మోక్షదాయకమైన మూర్తియెద్ది?
రంజింప రాణింప రక్షింప శిక్షింప
మూలకారణమైన మూర్తియెద్ది?
ప్రాపింప దీపింప భావింప భాషింపఁ
బుణ్యప్రదంబైన మూర్తియెద్ది?
పులకింపఁ దిలకింపఁ బొలియింపఁ బుంజింప
ముంగలియనఁదగు మూర్తియెద్ది?

గీ. అట్టి నీవిశ్వమూర్తి నహర్నిశంబుఁ
గొలుచుచుండెడు నీభక్తకోటినెల్లఁ
బుత్రప్రేమప్రవాహంబు బొంగిపారఁ
బ్రోచెదవుకాదె? వనమాలి! పుణ్యశాలి!

(కొంతతడవు ప్రార్థించును)

(పాదుషాదిక్కై) రాజా? ఇదేపనుము.

శా. శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతాసుధాపానమే
నానీతాధ్యవసాయచిత్తమున దుర్వ్యాపారముల్ మాని బ్ర
హ్మానందంబునఁ జేయుచుండుటయె తథ్యంబైన నీవృద్ధుఁడే
ప్రాణాపాయములేక నీయెదుటనే భాషించెడున్ జూడుమా?

[వృద్ధుఁడు సజీవుఁడై లేచును అందరు కరతాళములఁ జేయుదురు]

పాదు—(తెల్లబోయి చూచుచు ... ...)

వృద్ధ—రాజా! నామదేవు సామాన్యుఁడని యెంచకుము. కేవల మాతఁడు పాండురంగ స్వరూపుఁడే. భగవత్ప్రీతియుండనై యాతనిఁ బరీక్షించుటకును నీకుండు భిన్నాభిప్రాయము నాతనిచేఁ దొలఁగించుటకును జగంబునఁ బాండురంగని భక్త వాత్సల్యమును జూపుటకును నేనిట్టులొనర్చితి. ఆమహాత్మునెదుట మనమల్పులము. భక్తాగ్రణీ! నీవ్రతదీక్షను మెచ్చితిని. నిశ్చలచిత్తమున నిల్చుటయేకదా ధీరలక్షణములఁ జాటినది. కుమారా! నేఁజేసిన చర్యనుగూర్చి వింతపడకుము. ఇది యంతయు నాపాండురంగని యాజ్ఞ.

పాదు—(భక్తిభావముతో) సలాం. అచ్ఛాజీ.

(అందరు నమస్కరింతురు)

నామ—(అందరిని లేవదీసి) రాజా! వ్రతానుష్ఠానంబుకై యరుగవలయు. నేడు హరికథాకాలక్షేపమున నలంగుదము. మంత్రిపుంగవా! రమ్ము.

[నిష్క్రమించును]

[సభముగింపఁబడును]

[తెరవ్రాలును]

## 3వ రంగము — దేవాలయము — విప్రపురము

(విప్రులందరు శాస్త్రీయముగా వేషమును ధరించవలయును. గ్రామమున నవ్వజ [illegible] ఉండవలెను. కేవలము జ్ఞానులుగను నుండవలయును. నామదేవ [illegible] తన పనిని [illegible] గుడిమొద్దకుం జెక్కు బొట్టులతో గలసి మృదంగము తాళము సుతియు మొదలగు [illegible] చేయవలయును.

[తెరనెత్తగా దేవాలయంబున పూజారులు పూజసేయుచుందురు]

వెంక — రామావధాన్లు! మంత్రపుష్పం పూర్తిఅయినదా?

రామ — ఏమాత్రొందర? కొంచెము సేపు దాళలేవా యేమి?

వెంక — ఎంతసేపోయితానుటు. ఏమిసక్రమముగా చెప్పిచావవలెనా? ఏదో రెండుమూడుతలుకూసి ముగించుకోనరాదా. పెద్దబడుగుపని చేస్తావెందుకు!

రామ — ఏమండోయి! ఉత్సవమునాడన్న సక్రమముగా జరుపనీయండి. మామూలుదినములందు మన మెట్లుకూసినా భయములేదు.

వెంక — ఇప్పుడుమాత్ర మంతభయమేమి వచ్చినదిరా!

రామ — పదిమందివచ్చినప్పుడైనా కొంచెము మాలస్యము చేయకపోతే మనకెట్లు శాస్త్ర ప్రజ్ఞబయలుగాదు. అప్పుడేమనుకుంటే యేముంది?

వెంక — సరెసరె. ఇంకొభయమా? ఈవెధవలకు మనము చేసే సంగతులేమి తెలియ గలవు. కృష్ణశాస్త్రీ! ఆతీర్థము నింతలో నందరికి నొసంగుము ఇంతలో నాతిప్పపనికూడ ముగియును.

రామ — దానియందింకను గొంచెము నీరుపొయ్యండి.

వెంక — అదంతా మాకు నేర్పనక్కరలేదు. నీదేమో నివ్వు ముగించుకొని ప్రసాదమునుసిద్ధము జేసియుంచుము.

కృష్ణ — రంగని పాదతీర్థమును బుచ్చుకొనుడు.

[అందరికి నక్కడనున్న విప్రులకొసంగుచుండును]

(భజనసేయుచు నామదేవాదులు ప్రవేశింతురు.)

నామ—అయ్యా! సమయమునకువచ్చితిమి. మాకుఁగూడఁ దీర్థము నొసంగుడు.

కృష్ణ—మీరందరెవ్వరు?

నామ—పాండురంగని భక్తులము.

కృష్ణ—ఇక్కడ భక్తులుగానివా రెవరయ్యా! మీవర్ణ మేది?

నామ—వర్ణముతో నిమిత్తమేమి మహాత్మా!

కృష్ణ—చెప్పుటకు వెనుకాడెదవేల? శూద్రవర్ణ మాయేమి?

నామ—అవును.

కృష్ణ—అలా చెప్పుము. (గుడిదిక్కై) ఏమోయి రామావధాన్లు శూద్రభక్తులువచ్చి తీర్థమడుగుచున్నారు.

రామ—[బయటికివచ్చి] ఎవరయ్యా మీరందరు? శూద్రవెధవల కిక్కడఁ దీర్థమునిచ్చువార లెవ్వరును లేరు. ఇది బ్రాహ్మణులకు సంబంధించినచోటుగాని శూద్రులు నిలుచుతావుగాదు. అవతలికి వెళ్ళిపొండు.

నామ—స్వామీ! మహాత్ములు మీరలే యిట్టులఁ బల్కినచో మాకు దిక్కెవ్వరు? ఆలయంబునగూడ నిర్ణీతస్థలములుండెనా? భగవంతుని దృష్టి కందరును సమానులే. ఆతని సదనంబునఁ గాలూనుటకు మీకొక్కరికే యధికారమొసఁగెనా?

[ప్రవేశము—ఇంకొక బ్రాహ్మణుడు]

రామ—(అతనిఁజూచి] గోపాలమూర్తి! దయచేయుము.

గోపా—[నామదేవాదులఁజూచి] ఇదంతా యేమిటి? ఆలయమంతా శూద్రమయంగా చేసినావే?

రామ—ఎక్కడచచ్చేది? ఇవ్వాళ లేచినవేళ యటువంటిది. ఏమయ్యా! మీరు బయటికిపోండయ్యా! మాకవతలవారి చేతిలో మాటవస్తుంది.

నామ—అయ్యా! మావలన నిబ్బంది యేమికలుగుచున్నది?

వెంక—ఎవళ్ళురామీరు? మాయంటివారిముందర నోరెత్తి నిర్భయముగా మాటలాడుచున్నారు. మేమెవ్వరమో యెఱుఁగుదురా? మామాటకుఁ బాండురంగడే భయపడుచుండ శూద్రసన్యాసులు మీరెంతవారని మాకు నీతి జెప్పెదరు? మర్యాదగా అవతలికేగుడు ఇది బ్రాహ్మణులకేకాని శూద్రులకు నియమింపఁబడిన స్థలముగాదు. నోరుమూసికొని పొండు. లేనిచోఁ జెప్పేటికాప్రదానంబగును

నామ—భూసురోత్తమా! జ్ఞానవృద్ధులగు మీవంటివారలిట్లు పలుకఁదగునా? మేమాలయంబులోనికి రానేలేదే. మీస్వజాతివారలందరికి నొసంగిన యనంతరమే మాకొసంగుడు.

వెంక—ఎంతచెప్పిన బుద్ధిలేదా? రంగని పాదతీర్థ మొక్క బ్రాహ్మణులకేగాని యితరుల కెవ్వరికి నియ్యఁబడదు. వలసినంత తీర్థ మాకోనేటియందుఁగలదు. అచ్చట మీకడుపారఁ ద్రావుడు.

నామ—అందు మీయాజ్ఞ యేమున్నది స్వామీ!

వెంక—ఏమిటివి? ఇంకను మాప్రతాప మెఱుఁగవా సుమి? ఈ యాలయంబునఁగల పూరిపుడక దగ్గరనుండియు మా యధికారమునకు లోఁబడియున్నవి. ఆకోనేటియందు మాత్రము మీయిచ్చవచ్చినటులఁ దిగి నీరుద్రావనిత్తుమా?

కృష్ణ—[జనాంతికముగా] ఓరీ! వేంకటరత్నా! ఎక్కువగా మాటలనకుమా? వాండ్లందరొకటైనారా మనపనిసున్న. ఈతఁ డెవ్వఁడో గొప్ప శాంతస్వభావముగలవాఁడు ఈతని తీరుఁ జూడ భక్తశేఖరుఁడగు నామదేవునివలెఁ గన్పడుచున్నాడు. మిగులుగా మాటలు [illegible]. ఈతఁడు తలచినచో

భగవంతునిఁగూడ స్వాధీనము జేసికొనఁగలఁడు. అందరును మన నోళ్ళకు వెఱచి యూరకుండుటచే మనయాటలు సాగుచున్నవి కాని లేకపోతే గతులున్నవా ?

వెంక — (జనాంతికముగా) నీ కేది తెలియదుగాని మాటలాడకు. ఇంత మాత్రపు గండ్రతనమే లేకున్న మనపప్పులుడుకునా? ఈ వెధవలవలన మనకుఁ గలుగు భయమేమియును లేదు.

నామ — అయ్యా! తీర్థమునొసంగకున్నచోఁ గొంచెము ప్రసాదమేని యొసంగదరా?

వెంక — (పట్టరాని కోపముతో) నోరు మూయుము. మీకిక్కడఁదీర్థ ప్రసాదముల నిచ్చుటకెవ్వరును లేరు. ఉండదలచినచో నాలయపు వెనుకభాగమున నుండుము. [మెడఁబట్టి నెట్టును]

నామ — (శాంతభావముతో) స్వామీ! అంతమాత్రము తావొసంగుటయే మీకు పదివేల నమస్కారములు (భక్తుల దిక్కు) సోదరులారా! మనసఙ్కేతస్థలమున కేగుదము రండు.

ఆలయము — వెనుకభాగము

నామ — భక్తులారా! పాండురంగఁడు సర్వాంతర్యామి యగుటఁ జేసి యిచ్చోటను నిలచియున్నవాఁడు భజన సేయుఁడు

అనుబంధము ౨౧

(భక్తులందరు భజనసేయుచుందురు)

(బద్ధాంజలియై) తండ్రీ! పాండురంగా!

శా. భూదేవోత్తములన్నఁ బేర్వడసి నీపూజావిధానంబునం
దేదో వంచమునన్ నటించుచును దుష్కృత్యంబులన్నిల్పి నీ
పాదద్వంద్వముఁగొల్వనీక యిటులన్ బాధింపుచుండంగఁ గృ
ష్ణా! దీనావన! నీకుఁ జెల్లునె? మమున్ రక్షింప రాకుండఁగన్.

మహానుభావా!

గీ. నిరుపమానందలహరిలో వరలునీవు
ప్రబల భీకర గోముఖవ్యాఘ్రములనఁ
బోలు నీయర్చకులమధ్యఁబొందఁగలవె?
తిరుగుమా! మాదెసకు భవహారణమూర్తి!

(వెంటనే గుడితిరిగిపోవును)

(పాండురంగనిఁగాంచి పట్టరాని సంతసమున)

ద. జయజయపాండురంగ! నిజశాత్రవసంచయగర్వభంగ! దు
ర్జయభవతాపభంగి! ఖగరాజతురంగ! శుభాంగ! మానవా
మయవితమఃపతంగ! మునిమానసవారిజమత్తభృంగ! దు
ర్నయపరిశోధనాంగి! సుఘృణామయవార్ధిసుధాంగ! కేశవా!

[భజన సేయుచుండును]

ఆలయము—పార్శ్వస్థానము

వెంక—కృష్ణశాస్త్రి! కొంపమునిగిందే గుడికి గుడియేతిరిగిపోయిందే

కృష్ణ—నేఁజెప్పితే నీవు విన్నావా? అటువంటిభక్తసింహులఁ బరాభవించిన భగవంతుఁడూరకొనునా?

వెంక.—ఆసోది యిప్పుడెందుకు? ముందిప్పుడు మనము జేయవలసినదేమి? తీర్థప్రసాదములన్నియు గుడియందేయున్నవి.

రామ—చేయునదేమున్నది? ముందు నీవుబోయి యామహాత్ముని కాళ్ళమీదఁబడి క్షమాపణ వేడుకొనుము.

వెంక—నేను బోయి యాశూద్రవెధవను క్షమాపణమడుగుటయే?

కృష్ణ—అంతట నోటినిఁ గట్టిపెట్టుము ఈమాట వాండ్లు విన్నచో నీవు చెప్పినటుల నిజముగాఁ జెప్పేటికా ప్రదానముకాఁగలదు.

వెంక—(పట్టుదలతో) నాకాతని కాళ్ళమీదఁ బడి యేడువవలసిన యవసరమేమియును లేదు. నాకెక్కడఁబని యేమియును లేదు.

(పోఁబోవును)

అంద—(అడ్డగించి) మాకుఁ బ్రసాదమును బెట్టి మఱి కదలుడు.

వెంక—నాయొద్దనుండినగదా మీకుఁ బెట్టుట. పోయి యాతనినే యడుగుడు.

అంద—(లేచి నిలువఁబడి) అడుగుటకు మాకేమిపని? ఇదియంతయు జేసినవాఁడవు నీవుగాని మేముగాదు. పెట్టి మఱి కదలుము.

వెంక—(స్వగతము) ఇది నాకుఁ దప్పదు. వీరు వెడలిపోనివ్వరు. ఇంత బ్రతుకు బ్రతికి యింటివెనుకఁ జచ్చెనన్నట్లు ఇంతశాస్త్ర వేత్తనై తుదకు శూద్రుని కాళ్ళు పట్టవలసివచ్చెఁగదా? కర్మ విధి యెంతటిది? [ప్రకాశము] అయ్యలారా! అతని యొద్ద కేగుదము రండు.

[అందరును వెళ్ళుదురు]

వెంక—(నామదేవుని దగ్గరి) మహాత్మా! నాతప్పు క్షమించి నన్ను మన్నింపుడు. [అని కాళ్ళపైఁబడును]

నామ—(తత్తరముతో లేవఁదీసి) స్వామీ! నాయట్టియజ్ఞానుఁడా మీయట్టివానిని క్షమించుట? నాయపరాధమేదేనియున్నచో క్షమింపుడు.

రామ—మహాత్మా! భగవంతుఁడు కూడని దిక్కు మొగంబైయున్న వాఁడు. యథాస్థితి నొనర్పుడు.

నామ—(భక్తిభావముతో) తండ్రీ! పాండురంగా! భక్తులందఱి కను కూలంబగు దిక్కు మొగంబుననే యుండుము. నాయొక్క నికై కూడనిదిక్కు మొగంబున నుండుటేల? నేటికిఁగదా నీభక్త వాత్సల్యమహిమ యొందఱికిఁ దెలియవచ్చినది? తండ్రీ యథా స్థితిని నుండుము. [విప్రులఁగాంచి] మహాత్ములారా! పూర్వ స్థానమున కేగుదము రండు.

(అందరును నరుగుచుండ వారివెంటనే గుడియుఁ దిరుగుచుండును)

వెంక—అయ్యా! తీర్థప్రసాదముల మీరేయొసంగుడు.

[నామదేవు అచ్చటనున్నవారలకందఱకును తీర్థప్రసాదముల నొసంగుచు విష్ణు సంకీర్తన మొనర్చుచుండును.]

అనుబంధము ౨౮

[భక్తులందరు భజన సేయుచుందురు]

(విప్రులు స్వామికి హారతులొసంగుచుందురు)

[తెర జారును]

## మంగళము

మ. హరిపాదాంబుజయుగ్మక స్మరణ నిత్యాసక్తి భద్రాత్ములై
దురితాంభోనిధి నీదుచుం సుగుణసందోహస్వదానంద స
స్ఫురిత ప్రాభవకీర్తికాములగుచు సుజ్ఞానసంపదాసంఘులై
ధరణిం మానవులుందురుగాత! సకలార్థావాప్తి సంధిల్లఁగన్.

ఇది

శ్రీ గౌతమగోత్ర మను వాడి కులాన్వయ హనుమయసుమార సకలసుకవివిబుధజనవిధేయుండగు
వేంకటరత్న ప్రణీతంబగు

'భక్తి నామదేవు'

అను నాటకంబునందు సర్వంబును

సంపూర్ణము